# భారత స్వాతంత్ర్య సమరములు: 1757-1857

రచన: దిగవల్లి వేంకట శివరావు

జులై 2020

## 1. ఆంగ్లరాజ్య ధిక్కారము

మొగలు సామ్రాజ్యము విచ్ఛిన్నమై దేశములో అరాజకము వ్యాపించుచుండగా చిన్న చిన్న రాజులు నవాబులు స్వతంత్రరాజ్యములు స్థాపించుటకు ప్రయత్నింపసాగిరి. పాశ్చాత్యవర్తక కంపెనీవారు ఈ రాజులకు నవాబులకు సహాయముచేయు నెపమున దేశాక్రమణము చేసి తమ రాజ్యమును స్థాపించిరి.



ఈ పరిస్థితులలో దక్షిణమున హైదరాలీ టిప్పు సుల్తానులును, పశ్చిమమున మహారాష్ట్రులును, ఉత్తరమున సిక్కులును బలవంతులై స్వతంత్ర సామ్రాజ్యములు స్థాపించుటకు ప్రయత్నించి దేశాక్రమణ చేయుచున్న ఆంగ్లేయ వర్తక కంపెనీవారిని ప్రతిఘటించిరి. దేశములో అరాజకము వ్యాపింపచేసినచో నదిసులభముగా తమ వశమగునని ఆంగ్లేయులు పిండారీ మూకలను ప్రోత్సహించి చుట్టుపట్ల రాజ్యములపైకి ఎగదోలిరి. కొన్నాళ్ళకీ పిండారీ లింగ్లీషువారికెదురుతిరిగిరి. అందువలన వారితో యుద్ధములు తటస్థించినవి.

ఆంగ్లేయ వర్తక కంపెనీవారొక్కసారిగా బహిరంగముగా దేశాక్రమణ చేసి రాజ్యస్థాపనము చేయక ముందుగా కొన్ని ప్రాంతములను తమ కీలుబొమ్మలచే ప్రభుత్వముచేయించి తాము తెరవెనుక భాగవతమునాడి తరువాత తామే ప్రభువులైరి. వీరు జాగీరులు జమీందారీలు రాజ్యభాగములు సంపాదించి దివానులై ప్రభుత్వము చెలాయించు చుండగా వీరి రాజ్యాధికారమును మనదేశ ప్రజలలో వివిధ వర్గములవారును రాజులును నవాబులును ధిక్కరించి ఆయుధములు పూని యుద్ధములు చేసిరి. ఈ స్వాతంత్ర్య సమరములు 1757 నుండి 1857 వరకును జరిగినవి.

సన్యాసుల యుద్ధములు: 1760-1775

ఇంగ్లీషు వర్తక కుంపినీవారు వంగరాష్ట్ర నవాబైన సిరాజ్ ఉద్దౌలాను సింహాసభ్రష్టుని జేయుటకు 1757లో కుట్రచేసిరి. ఆ నవాబు దగ్గరవాడును సేనాపతియునైన మీర్జాఫరు ఇంగ్లీషువారి కుట్రతో స్వామిద్రోహముచేసి నవాబును వధించి తానే నవాబయ్యెను. అంతట వంగరాష్ట్రమునందు పేరునకు నవాబు ప్రభుత్వము జరుగుచున్నను నిజమునకీ విజాతీయ కుంపెనీవారే పరిపాలింపసాగిరి. ఈ దొరలు చేసిన అన్యాయమును వీరు చేయు అక్రమములును చూడగా వంగ రాష్ట్ర ప్రజలకు ఇంగ్లీషువారిపైన అసహ్యముకలిగెను.

ఒకవంక ఇంగ్లీషువారు వంగ రాష్ట్రములో తమ రాజ్యాధిపత్యమును స్థాపించుచుండగా నింకొకవంక వారి అధికారముపట్ల ప్రజలు ధిక్కారము చూపసాగిరి. ఇంగ్లీషు దొరలు నవాబు ఉద్యోగుల ద్వారా దుష్పరిపాలనము గావింపసాగిరి. వారు 1765లో మొగలుచక్రవర్తినాశ్రయించి పన్నులు వసూలుచేయు దివాన్గిరీ అధికారమును పొందిరి. క్రమక్రమముగా దేశములో నింగ్లీషుప్రభుత్వము స్థిరపడెను.

ఈ పరిస్థితులలో ఇంగ్లీషువారి యధికారమును ధిక్కరించుటలో వివిధ సంప్రదాయములకు చెందిన సన్యాసులు బైరాగులు గోసాయిలు నేకమై ప్రతియేటను ఇంగ్లీషువారి గిడ్డంగులపైనను వారి గ్రామములపైనను దండయాత్రలు చేయనారంభించిరి. ఈ పోరాటము 1763 నుంచి 1775 వరకును పండ్రెండేండ్లు జరిగెను. దీనికి సంబంధించిన రహస్య రికార్డులనింగ్లీషు ప్రభుత్వమువారు

బయటపెట్టనందుననివి 1957 డిశంబరులో నవోదయ పబ్లిషర్సుచే ప్రకటించబడినంతవరకు చరిత్రకెక్కలేదు.

ఈ సన్యాసుల దండయాత్రలనుగూర్చియు సన్యాసులనుగూర్చియు చరిత్రకారులెవరికి తోచినట్లు వారు వ్రాసియున్నారు. వీరు ఆయుధపాణులై వచ్చిపడుచుందురని గ్రామస్థులనుండి బలవంతముగా సొమ్ము లాగికొని దోచుకొనుచుండిరని వీరు ఆకతాయిమూకలనియు వ్రాసిరి. అయితే ఆ కాలమున గవర్నరుగానుండి ఆ సంగతులన్నియు స్వయముగానెఱిగియుండిన వారన్ హేస్టింగ్సు ఈ సన్యాసులు వివిధ సంప్రదాయములకు చెందినవారనియు వీరు నిరంతరముగా దేశములో తిరుగుచుందురనియు వీరిలో చాలామంది వ్యాపారము చేయుచుందురనియు వీరందరును తీర్థవాసులైయున్నందువలన ప్రజలు వీరిని పూజింతురనియు వారి రాకపోకలనుగూర్చి ప్రజలవలన తెలిసికొనుటగాని వారికి వ్యతిరేకముగా సహాయము పొందుటగాని సాధ్యముకాదనియు నందువలననీ దండయాత్రలను అరికట్టుట కష్టముగానున్నదనియు 1773 మార్చి 9వ తేదీన నొక లేఖలో వ్రాసియున్నాడు. ఉత్తరహిందూస్థానమున వివిధ సంప్రదాయములకు చెందిన సన్యాసులున్నారు. సన్యాసాశ్రమ విధులను యథావిధిగా పాటింపని గోసాయిలను సన్యాసులు వ్యాపారమును చేయుచు వివిధ వృత్తులు చేయుచుందురు. సన్యాసులలో ఆయుధపాణులైన నాగ సన్యాసులు మొదలైనవారు ఇరుగుపొరుగువారితోను తమలోతామును యుద్ధముచేయుచుందురు.

సాధారణముగా తీర్థయాత్రలు చేయుచు దేశములో తిరుగుచుండు సన్యాసులు సాధువులు బైరాగులు మొదలైనవారిని గోసాయిలని వ్యవహరింతురు. సన్యాసులు సాధారణముగా అందరితోనూ మంచిగానుందురేగాని ఎవ్వరిపైనను కత్తికట్టియుద్ధముచేయరు. అట్టి వివిధ సంప్రదాయములకు చెందిన సన్యాసులు, గోసాయిలు మొదలైనవారందరునేకమై, ఇంగ్లీషువారి రాజ్యముపైన దండయాత్రచేసిరనినచో దానికేదో కారణముండవలెను. ఆ కాలమునాటి ఇంగ్లీషు కుంపిణీ ప్రభుత్వమువారి రికార్డులను పరిశీలించి బ్రజేంద్రనాథ బెనర్జీగారు 1926లో నీసన్యాసుల దండయాత్రలనుగూర్చి మోడరన్ రివ్యూ సెప్టెంబరు, అక్టోబరు సంచికలలో రెండు వ్యాసములను వ్రాసియున్నారు. అందులో ఆ రికార్డులనుండి కొన్ని భాగములను వివరించినారు. వానినిబట్టి

చూడగా ఈ సన్యాసులేదోయొక సంవత్సరమున నొకటిరెండుమారులు గాక 1763లోను 1767 మొదలు 1775 వరకును ప్రతిసంవత్సరము దండయాత్రలు చేయుచుండిరని తెలియుచున్నది. ఇంతేగాక కొలదిమందిగాక వేలకొలదిగా వచ్చిపడుచుండిరి. ఆంగ్లేయ కలెక్టరులు వ్రాసిన లేఖలనుబట్టి చూడగా గ్రామస్థులీ సన్యాసులను శత్రువులుగా పరిగణింపక వీరిని మిత్రులుగనే చూచుచు వారికనేకవిధములుగ సహాయముకూడా చేయుచుండిరి. ఇంగ్లీషువారి సైనికోద్యోగుల క్రింద సన్యాసులతో పోరాడుటకు వచ్చిన సిపాయిలకు గ్రామస్థులు తోడ్పడకపోవుటయెగాక వారిని సన్యాసులకు పట్టియిచ్చుచుండిరి. అందువలననీ సన్యాసులు చేసినదియుద్ధమేగాని తిరుగుబాటుకాదు.

దండయాత్రలు సాగుచుండిన కాలమున గూడా వంగదేశములో కలకత్తా, ఢాకా మొదలగు పెద్దపట్టణములందు వందలకొలది గోసాయీలు మొదలైనవారు కాపురముండి వ్యాపారము చేసికొనుచు జనసామాన్యముతోపాటు జీవించుచుండిరి. వీరికిని దండయాత్ర చేయు సన్యాసులతో సంబంధమున్నట్లు ఇంగ్లీషు కుంపిణీ దొరలకు అనుమానముండెనుగాని వారినేమియు చేయలేకపోయిరి.

ఒకవంక సన్యాసులిట్లు దండయాత్రలు చేయుచు కుంపిణీవారి సేనలతో యుద్ధములు చేయుచు శత్రురాజ్యము మధ్యలోనున్న పుణ్యస్థలములను సేవించుచు తమ దండయాత్రలను ముగించుకొని పోవుచు గొప్ప నదులలో స్నానములు చేయుచు తమ మతాచారములను యథావిధిగా జరుపుకొనుచుండిరి. ప్రజలు వీరికాతిథ్యమిచ్చి యాదరించుచునే యుండిరి. దేశములో శాంతిభద్రతలను స్థాపించుటకు నియమించబడిన ఫౌజుదారులక్రింద వివిధ పరగణాలలోనున్న సిపాయిలు ఈ సన్యాసులను ప్రతిఘటించుటకు ఇంగ్లీషు సైనికాధికారుల క్రింద వచ్చి సన్యాసులనెదుర్కొన్నప్పుడు వారితో సంభాషణలు జరుపుచుండిరని క్రమశిక్షణము లేకుండా ప్రవర్తించుచుండిరని తమ తుపాకులను అనవసరముగా పేల్చి మందుగుండు సామగ్రిని వ్యర్థం చేయుచుండిరనియు అటుపిమ్మట సన్యాసులు వచ్చి వీరిని ముట్టడించుచుండిరనియు ఈ సిపాయిలను నమ్ముటకు వీలులేకున్నదనియు ఇంగ్లీషు సైనికాధికారులును కలెక్టరులును వ్రాయగా

కలకత్తాలోని కుంపిణీ ప్రభుత్వాధికారులు మిడ్నపూరు రెజిమెంటుకు హెచ్చరిక కూడా చేసిరి. (From J. Stewart, Secretary: to Edward Baber, Resident of Midnapur, dated Fort Willam 4 Feb 1773. Secret proceedings 10.3.1773 Nos 10-11.)



ఈ పరిస్థితులను చూడగా ఆ కాలమున దేశములోని హిందూమహమ్మదీయ ప్రజలలో నన్ని తరగతులవారికిని ఇంగ్లీషు కుంపిణీవారిపట్ల గౌరవముగాని భయభక్తులుగాని లేవనియు సన్యాసులపట్ల సానుభూతి యుండెననియు స్పష్టపడుచున్నది. కొందరు జమీందారులు కూడా సన్యాసులకు తోడ్పడుచున్నారనియు వారిపైన చర్యతీసుకొందు మనియు వారన్ హేస్టింగ్స్ వ్రాసెను (31-03-1773). ఇంకొక చిత్రమేమనగా నీసన్యాసులు కేవలము ఇంగ్లీషువారికి పలుకుబడియు నధికారమును కలిగియుండిన వంగదేశముపైననే యిట్లు దండయాత్రలు చేసిరికాని ఇతర దేశీయ రాజుల రాజ్యముపైనగాని నవాబుల రాజ్యముపైనగాని చేయలేదు. ఇంగ్లీషు కుంపిణీవారి యధికారమునకు లోబడిన గ్రామములపైననే వారు దండయాత్రలు చేసి కుంపిణీవారి యుద్యోగులక్రింది సైనికులతో యుద్ధము చేయుచుండిరి. సాధారణముగా పరగణా సిపాయిలు కొంతసేపు పోరాడి పారిపోవుచుండిరి. సన్యాసులు కుంపిణీవారికి రావలసిన శిస్తులు రాకుండా గ్రామముల నుండి ముందుగానే సొమ్మును వసూలుచేసికొనిపోవుచుండిరి. ఇంగ్లీషు కుంపిణీవారి నౌకరులగువారి నాశ్రయించితిరుగు జమీందారుల యుద్యోగులను వర్తకులను గ్రామస్థులను పట్టుకొని నిర్బంధించి బలవంతముగా సొమ్ముపుచ్చుకొని వదలివేయుచుండిరి. అంతేగాని ఇతరులనిట్లు

పట్టుకొని బాధింపలేదు. అప్పుడప్పుడు వారు కొన్ని దౌర్జన్యములు చేసినట్లు చెప్పబడినను తరువాత కొన్ని సంవత్సరములకు పిండారీలను దోపిడిగాండ్రు చేసినట్లు పురుషులను చిత్రవధలుచేయుటగాని స్త్రీలను మానభంగములు చేయుటగాని పిల్లలను ముసలివాండ్రను హింసించుటగాని ఎన్నడూ చేయలేదు. వీరు వచ్చుచున్నారని తెలియగనే గ్రామస్థులు ఇండ్లు వదిలిపెట్టిపోవుచుండిరని కలెక్టరులు వ్రాసినమాట నిజమేగాని దానికి కారణము వారు అక్కడనున్నచో నింగ్లీషు అధికారులు తమకు సహాయము చేయుడని నిర్బంధింతురనియే! సన్యాసులకు గ్రామస్థులు కావలసిన ఆహారపదార్థములను ఇతర వస్తువులనిచ్చి సహాయముచేయుటయెగాక వారికి దారిచూపుచు వారికి శత్రుసైనికులకు పట్టియిచ్చుచుండిరి.

సన్యాసులు తమ గ్రామములను దోచి బలవంతముగా సొమ్ము వసూలుచేసికొనిపోవుచున్నారని ఇంగ్లీషువారు వారిపైన నిందను మోపిరేగాని ఆ కాలమున శత్రువుల గ్రామములను దోచి సొమ్ము వసూలుచేయని యుద్ధములే లేవు. ఇంగ్లీషు కుంపిణీవారు కూడా వారు చేసిన అన్ని యుద్ధములందును శత్రువుల పట్టణములను కొల్లగొని దోపిడిసొమ్ము వసూలుచేసి దానిని కుంపిణీవారును వారి యుద్యోగులును కూడా పంచుకొనిరి. ఇంతేకాదు ఇంగ్లాండు రాజు కుంపిణీవారికిచ్చిన సైనికాధికారులకును సైనికునకును ఈ దోపిడీ సొమ్ములో వాటానిచ్చు విషయమును గూర్చి కుంపిణీవారు ఇంగ్లీషు రాజు వలన పొందిన పట్టాలోనే యుదాహరింపబడియున్నది (The Nabobs of Madras, Henry Dodwell, P. 65).

అందువలన సన్యాసులు ఇంగ్లీషువారిని శత్రువులుగా పరిగణించి వారి రాజ్యముపైన దండయాత్రలు చేయుచున్నప్పుడు వారి గ్రామములను కొల్లగొని దోపిడీ సొమ్ము వసూలుచేయుటలో తప్పులేదనియె యెంచవలసియున్నది. దోపిడి చేయకుండా అడ్డుపడి ఆ పట్టణాలు కొల్లగొనుటవలన తమకు రాదగిన సొమ్మును శత్రురాజునుండి వసూలుచేయు పద్ధతిని సిరాజుద్దౌలా వధింపబడిన పిమ్మట ముర్షిదాబాదులో కూడా ఇంగ్లీషువారవలంబించిరి.

సన్యాసులు కొన్నియేండ్లపాటు ఇంగ్లీషు రాజ్యాధికారమును ధిక్కరించి వంగదేశముపైన దండయాత్రలు చేయుచునింగ్లీషు సైనికాధికారుల క్రింద తమనెదిరించిన సేనలతో యుద్ధము చేయుచుండగా దీనినాంగ్లేయ చరిత్రకారులొక తిరుగుబాటు అని వ్రాయుటకు కారణము లేకపోలేదు. ఆంగ్లరాజ్యాధికారమును ధిక్కరించుచు భారతీయులు చేసియుండిన అన్ని యుద్ధములనుగూర్చియు బ్రిటిష్ సామ్రాజ్యము వర్ధిల్లుచున్న కాలమున ఆంగ్ల చరిత్రకారులిట్లే వ్రాసిరి. భారతీయులీయుద్ధములను గూర్చి స్మరించి దేశాభిమానము కలిగినచో జాతీయభావములు వర్ధిల్లుననియు అది ఆంగ్ల సామ్రాజ్యమునకు ప్రమాదకరమనియు వారియభిప్రాయము. ఆంగ్ల ప్రభుభక్తి కలిగిన భారతీయ చరిత్రకారులు నీపాఠములనే వల్లించిరి.

ఈ సన్యాసులు చేసిన యుద్ధవిధానమును పరిశీలించినచో అది ధర్మయుద్ధమేయని తేటపడగలదు. లోకసంగ్రహముకొరకును మతధర్మములను రక్షించుటకును మ్లేచ్ఛులను ప్రతిఘటించి ధర్మసంస్థాపనము చేయుటలో మహానుభావులైన సన్యాసులు కూడా రాజులకు తోడ్పడినట్లు మనదేశ చరిత్రలో కొన్ని యుదాహరణములున్నవి. దక్షిణదేశమున మహమ్మదీయులు విజృంభించి హిందూమత ధర్మములను నాశనము చేయుచుండగా విద్యారణ్యులవారు సంగమరాజపుత్రులకు కుడిభుజమై నిలిచి విద్యానగర సామ్రాజ్యస్థాపనమునకు పునాదులు నిర్మించిరి. ఔరంగజేబు చక్రవర్తి కాలమున హిందువుల మతాచారములకు రక్షణ లేకపోవగా శివాజీ మహారాజు ధర్మసంస్థాపనము కొరకు యుద్ధములు చేసి మహారాష్ట్ర సామ్రాజ్యమును స్థాపించుటలో రామదాసస్వామి తోడ్పడెను. అక్బరు చక్రవర్తి కాలమున ఆయుధపాణులైన మహమ్మదీయ ఫకీరులు నిరాయుధులైన హిందూ సన్యాసులను హింసింపగా మధుసూదనసరస్వతి చక్రవర్తికి విన్నవించినను లాభములేకపోగా ధర్మసంరక్షణము కొరకై క్షత్రియులనాహ్వానించి వారికి సన్యాస దీక్షనొసగి మతధర్మములను రక్షించు భారము వారిపైనుంచెను. అంతటవారు హిందూ సన్యాసులను రక్షించి మతధర్మమును కాపాడిరి. ఆ సందర్భమున తీర్థ, ఆశ్రమ, సరస్వతి యను మూడు సంప్రదాయములు గాక తక్కిన ఏడు సంప్రదాయములందు అనగా వన, రణ, గిరి, పర్వత, సాగర, భారతి, పురి అను

సంప్రదాయములందును క్షత్రియులు ప్రవేశపెట్టబడిరి. మహమ్మదీయ రాజ్యకాలమునందు హిందూ సన్యాసయోధులు మతధర్మములకై పోరాడిన యుదాహరణములింకను కలవు.

మొగలాయి సామ్రాజ్యము విచ్ఛిన్నమై వివిధ రాష్ట్రములనేలు నవాబులు స్వతంత్రులై రాజ్యాధికారము కొరకు పెనగులాడుచుండగా వర్తకముకొరకే దేశమునకు వచ్చిన పాశ్చాత్యులు దేశములోని రాజకీయములందు ప్రవేశించి బలవంతులై రాజ్యాక్రమణముచేయుచు తమ లాభములను చూచుకొనసాగిరి. మన రాజులు నవాబులు బలహీనులుగానున్నందున ఈ పాశ్చాత్యులు వారిని తమ చేతిలో కీలుబొమ్మలుగా నాడింపసాగిరి. దేశ ప్రజల ధనమునకు మానమునకు ప్రాణములకు రక్షణలేని స్థితికలిగెను. ధర్మార్థకామమోక్షములు అడుగంటెను. అరాజకము ప్రబలెను. దేశప్రజల మొఱలు విని వారి బాధలను మాన్పువారే లేకపోయిరి. వంగదేశమునందు ఇంగ్లీషువారు 1757లో మీర్జాఫరును గద్దెనెక్కించి తాము వెనుకనుండి భాగవతమునాడసాగిరి. ఆ కాలమున జరుగు అన్యాయములకెల్ల ఈ విజాతీయులైన పాశ్చాత్యులే కారకులని ప్రజలు గ్రహించిరి.

ఆంగ్లేయులపైన ఆ కాలమునాటి ప్రజలకు గౌరవము లేదు సరికదా అసహ్యముగానుండెను. దీనికి కారణము దేశములోని హిందూమహమ్మదీయుల మతధర్మములకు విరుద్ధములైన ఆచారములను కలిగి పంది మాంసము, గొడ్డు మాంసము తినుచు మద్యపానము చేయుచు శౌచవిధులను పాటింపక నీతినియమములు లేక తమ వ్యవహారములందు దేశీయులను మోసగించుచుండినందున పోర్చుగీసువారిని వారితోపాటు తెల్లవారినందరిని అసహ్యించుకొనుచు వారిని పరంగివారని వ్యవహరింపసాగిరి. ఇట్టి పరంగిజాతివారైన ఈ ఆంగ్లేయులు వచ్చి వంగదేశములో పలుకుబడి సంపాదించి అరాజకము వ్యాపింపజేసి ప్రజలను పీడించుచుండగా ప్రజలతో అవినాభావ సంబంధముగల గోసాయిలు మొదలగు సన్యాసులు కూడా బాధలననుభవించి పరిస్థితులు దుర్భరములు కాగా వారందఱునేకమై ఆంగ్లేయుల జాగీరు గ్రామములపైనను వారికి పలుకుబడిగల ఇతర ప్రాంతములపైనను దండయాత్రలు చేయసాగిరి. ఇదియొక మహా యుద్ధముగా పరిణమించెను.

సన్యాసుల యుద్ధకాలమునాటి వంగదేశ చరిత్రను పరిశీలించినచో 1757 మొదలు 1772 వఱకును ఆంగ్లేయులు వంగదేశమునందు ప్రభుత్వభారమును గాని దాని బాధ్యతలనుగాని వహింపక తాము వెనుకనుండి అన్ని వ్యవహారములను నవాబుగారి యుద్యోగుల ద్వారా జరుపుచు తమ లాభమును మాత్రము చూచుకొనుచుండిరని దేశములో శాంతిభద్రతలు లేకుండెనని ప్రజల ధనమునకు మానమునకు ప్రాణములకు రక్షణ లేకుండెనని, దేశములో నింగ్లీషు కుంపిణీవారి యుద్యోగులు నౌకరులు చెదపురుగుల వలె వ్యాపించి అన్ని వ్యాపారములు చేజిక్కించుకొని సుంకములు లేకుండా సర్వమక్తాగా జరుపుచు ఇతరులను చేయనివ్వక సరకులను తమకు చౌకగా అమ్మునట్లు తమ సరకులను హెచ్చువెలలకు కొనునట్లు బలవంతముచేయుచు, రైతుల వలన శిస్తులను బలవంతముగా వసూలుచేయుచు చీటికిమాటికి కొట్టి హింసించుచు వారిపైన అక్రమ నేరములు మోపి శిక్షించుచు దేశభాష తెలియని తెలుగు సిపాయిలను తెచ్చి వారి సహాయమున దౌర్జన్యము చేయుచు అమిత లాభములను మింగసాగిరి. రైతులు పారిశ్రామికులు తమ ఇండ్లువాకిళ్ళు వదలి అడవులపాలైరి. దేశములో ధాన్యము ధర పెరిగెను. 1768లో దేశములోని ధాన్యమును ఇంగ్లీషువారి తోడ్పాటుతో ఇతర ప్రాంతముల వర్తకులు ఎగుమతిచేసిరి. 1769లో దుర్భిక్షము కలిగెను. 1770లో కనివినియెరుగని కఱవు వచ్చెను. ప్రజలు తిండిలేక మలమలమాడి చచ్చిపోవుచుండిరి. కుంపిణీవారి యుద్యోగులు ధాన్యవ్యాపారము చేయుచు లాభములార్జింపసాగిరి. నిర్దయులై పన్నులు వసూలుచేయసాగిరి. వంగదేశమున మూడువ వంతు జనము చచ్చిరి. తరువాత కూడా రెండేండ్లు ప్రజలు బాధలు పడిరి. ఈ దుర్భర పరిస్థితులలో కూడా ప్రజల మొఱలాలకించు నాథుడు లేకపోయెను. తుదకు కుంపిణీవారు 1772లో ప్రభుత్వ భారము వహించిరి. కాని వారి కలెక్టరులు న్యాయాధిపతులు స్వార్థపరులై ప్రజలను పీడించుచుండిరి. కుంపిణీ పరిపాలనము కట్టుదిట్టములతో జరుగసాగెనుగాని ప్రజల బాధలు మానలేదు. (కుంపిణీ బహదూర్ అను ప్రత్యేక గ్రంథభాగమునను ఆంగ్లరాజ్యాధిపత్యము: ఆంగ్ల ప్రభుభక్తుని విమర్శనము అను ప్రకరణములందును ఆ కాలమునాటి ప్రజల బాధలు వర్ణింపబడినవి. నేను రచించిన సన్యాసుల స్వాతంత్ర్య సమరము అను చిన్న గ్రంథమునందు చరిత్ర వర్ణింపబడినది.)

వారన్ హేస్టింగ్సు 1774లో గవర్నరు జనరలుగా నియమింపబడెను. అతని పరిపాలనముగూర్చియు కార్యాలోచన సభకు ప్రజలు ఫిర్యాదులంపసాగిరి. వారన్ హేస్టింగ్సుకు కార్యాలోచన సభ్యులకు విరోధములేర్పడెను. ప్రభుత్వము సక్రమముగా సాగకుండెను. ఈ పరిస్థితులలో సన్యాసులాంగ్లేయ ప్రభుత్వాధికారమును ధిక్కరించి పోరాడి అనేక బాధలనుభవించిరి. వారనేక యుద్ధములందు జయించినను తుదకాంగ్లేయుల ఫిరంగి దళములను ప్రతిఘటింపలేకపోయిరి. ఈ యుద్ధములవలన కుంపిణీవారి పరిపాలనలోని లోపములు బయల్పడెను. దేశములో శాంతిభద్రతలు స్థాపించబడెను. క్రమపరిపాలనము నెలకొల్పబడెను.

వంగరాష్ట్రములో ఇంగ్లీషు ప్రభుత్వోద్యోగిగా పనిచేసి గొప్ప నవలలను వ్రాసిన బంకించంద్రచటర్జీగారు సన్యాసుల యుద్ధమునితివృత్తముగా గైకొని ఆనందమఠమను నవలనురచించిరి. అది దేశాభిమానపూరితములైన భావములతో నిండియున్నది. వందేమాతర గీతము అందులోనే వ్రాయబడి చరిత్ర ప్రసిద్ధికెక్కినది.

1781 నాటి తిరుగుబాటు

'మన సైన్యములు సర్వదా అప్రమత్తతతో నున్నందువలననే దేశప్రజలు తిరుగుబాటు చేయకుండా ఉన్నారని అందఱు నంగీకరించు విషయమే. రవ్వంత అవకాశము గలిగిననతటనే ప్రజలు తిరుగుబాటుచేయుటకు ప్రయత్నించుచుందురనుటకు నిదర్శనములున్నవి.' అని ఫ్రెడరిక్ జాన్ షోర్ 1883 ఏప్రిల్‌లో వ్రాసి, దానికీ క్రింది యుదాహరణము నిచ్చిరి:

1781లో గవర్నరుజనరల్ అయిన వారన్ హేస్టింగ్సుకును కాశీ లేక బనారసు రాజైన చెయితు సింగుకును వివాదము జరిగిన సందర్భమున, వారన్ హేస్టింగ్స్ కాశికి వెళ్ళెను. అప్పుడక్కడ చెయితు సింగు ఆయనపైన తిరుగుబాటు చేసెను. అంతట హేస్టింగ్సు చునార్‌గఢ్ కోటకు పోయి ప్రాణము దక్కించుకొనెను. అప్పుడు వారన్ హేస్టింగ్సు మరణించెనని ఒక పుకారు పుట్టెను. అంతట వంగ రాష్ట్రములో వివిధ మండలములందు అల్లరులు జరిగెను. ముఖ్యముగా రాజషాహి, బిర్‌భూమ్ జిల్లాలలో కుంపిణీవారి శిస్తు రివిన్యూ వసూలు చాలావరకు నిలిచిపోయెను. ఇంగ్లీషు ఉద్యోగుల

యధికారము తృణీకరింపబడెను (Notes on Indian Affairs from Frederick John Shore (1837) Vol 1, p. 161).

కాశీరాజైన చెయితుసింగును కంపెనీకి 50వేల నవరసులు ఇవ్వవలసినదని వారన్ హేస్టింగ్సు కోరగా అతడు నిరాకరించెను. అతనిని నిర్బంధింపగా చెరనుండి తప్పించుకుపోయెను. వారన్ హేస్టింగ్సు పరివారముపైన కాశీరాజు సేనలు తిరుగబడెను. అంతట వారన్ హేస్టింగ్సు చునారుగఢ్ కోటకు పారిపోయి ప్రాణములు దక్కించుకొనెను. ఈ విషయమును గూర్చి 'ది గ్రేట్ ప్రోకాన్సల్' అనునొక చరిత్ర గ్రంథమందు సిడ్నీ సి. గ్రయర్‌గారు చక్కగా వర్ణించిరి (The Great Proconsul: Sydney C. Grier 1884 Chapter XXII).

బనారసులో కొంత అల్లరయి తిరుగుబాటు జరుగగా వారన్ హేస్టింగ్సు తన సైనికదళముతో చునార్ గఢ్ కోటకు పోయెను. కొందరాయన ఆ కోట చేరుకొనెననిరి. మఱికొందరు చేరలేదనిరి. ఇంతలో అతడు ప్రాణములను బాసెననువార్తయొకటి పుట్టెను. అది వాయువేగముతో నలుగడల వ్యాపించెను. కలకత్తాలో వారన్ హేస్టింగ్సు నివాస గృహముదగ్గర ఆ మరునాటి యుదయముననే యొక చిత్రము జరిగెను. ఆ కాలములో వారన్ హేస్టింగ్సును ప్రశంసించు హిందీ పాటయొకటి కలకత్తా నగరమున ప్రచారములో నుండెను.

*హాతీ పర్ హౌదా, ఘోడే పర్ జీన్*
*జల్దీ బహర్ జాతా, మెస్తర్ హస్తీన్*

అనగా, ఏనుగుపైన అంబారీ, గుఱ్ఱముపైన జీను వేసియుండగా హేస్టింగ్సు సాహేబుగారు ఊరేగుచున్నారని అర్థము. ఈ పాట బాగా ప్రచారములో నుండినట్లు 1823లో కలకత్తాలో ఇంగ్లీషు క్రైస్తవ మతాధికారిగా నుండిన బిషప్ హెబరు వ్రాసియున్నారు. కాశీలో హేస్టింగ్సు మరణించెనను వార్త పుట్టినదినమున, అనగా బనారసు సంఘటనము జరిగిన మరునాటియుదయమున కలకత్తాలో ఆయన బంగాళా దగ్గర పనిచేయునొక దేశీయ పరిచారిక ఒక బాలునాడించుచు పైపాటనే యీవిధముగా మార్చి పాడెను:

*ఘోడే పర్ హౌదా, హాతీ పర్ జీన్*

*జల్దీ భాగ్ గయ్యా, మెస్తర్ హాస్తీన్*

అనగా, 'గుఱ్ఱము పైన అంబారీ, ఏనుగు పైన జీను తారుమారుగానుండగా హేస్టింగ్సుగారు త్వరగా పరారియగుచున్నారు.' అని దీని అర్థము. పైన చెప్పిన పాటలో హేస్టింగ్సుగారి గౌరవార్థముగా ప్రజలు పాడు మొదటి పాట 1824లో కలకత్తాలో బిషప్ హెబర్‌గారి కాలములో కూడా ప్రచారంలోనుండెనని ఆయన వ్రాసిరి.

ఈ పాట వినినయొక దొర యాదాసినిదేమని ప్రశ్నింపగా నామె హేస్టింగ్సుగారికి అపజయము కలిగినట్లు తాను వింటినని బదులు చెప్పెను! ఇంగ్లీషువారికి దూరపు సమాచారములు అందులోపలనే చాలా ముందుగా నావార్తలు ఈ దేశీయులకెట్లో తెలియుచుండుననియు, దీని రహస్యము ఇంగ్లీషువారు గ్రహింపలేకున్నారనియు ఆ దొర అక్కడివారితోననెను. ఐరోపాలో జరిగిన సంగతులనుగూర్చి, ఆంగ్లేయులకు అధికారపూర్వకముగా వార్తలు వచ్చులోపలనే ఆ సంగతులన్నీ దేశీయులు బజారులలో చెప్పుకొందురనియు, ఆంగ్లేయులకు తెలియని వార్తాసంగ్రహణ మార్గములు కొన్ని వారికి కలవనియు బిషప్ హెబరుగారు తమ జర్నలులో వ్రాసినారు.

ఈ వార్త నిజమని త్వరలోనే రుజువయ్యెను. వారన్ హేస్టింగ్సుగారి దగ్గరనుండియే తనకపజయము కలిగినట్లు ఒక సన్నని ఉల్లిపొరవంటి కాగితము పైన వ్రాసి, దానినొక బాతుకలముయొక్క మొదలు దగ్గరనున్న గుల్లలో జొప్పించి దానినొక వార్తావహుడు తీసికొనివచ్చెను. అతని యొడలిపైన గోచితప్ప వేరు వస్త్రము లేదు. దారిలో కొందఱు దేశీయ సిపాయిలు తనను నఖశిఖపర్యంతరము సోదాచేసిరనియు, ఈ బాతుకలముముక్క వారికి దొరకకుండా దాచివేయ గలిగితిననియు చెప్పుచు వాడా సందేశము నిచ్చెను.

అప్పుడు సుప్రీముకోర్టు న్యాయమూర్తిగా నుండిన సర్ ఎలిజా ఇంపేగారు జిల్లా కోర్టులను పరీక్షించుటకు పట్నా నగరమునకుపోయి తిరిగివచ్చెను. హేస్టింగ్సుగారు పరారీ అయ్యారను వార్త ఆక్కడివారందరికినెట్లో తెలిసెననియు, అక్కడి సిపాయిలు ఇంగీషువారి కొలువు వదలివేసి

వెళ్ళిపోవుచున్నారనియు, చుట్టుపట్లనున్న జమీందారులు కాశీరాజుకు తమ యభినందనములను పంపించుచున్నారనియు, అయోధ్యాబేగములు కాశీరాజు కొఱకు కొంత ధనమును సైన్యమును ప్రోగుచేసి పంపిరనియు నతడు చెప్పెను.

'ఈ దేశమున, ఉచ్చస్థితిలోనున్న ప్రభువులనాశ్రయించి స్తోత్రపాఠములు చదువుచు వారికి సర్వవిధములుగను సహాయము చేయుదురు. ఆ ప్రభువునకే దురదృష్టవశమున చిక్కులు కలిగినచో, వారాతనిని తృణీకరించి అపకారముకూడా చేయుదురు. పట్నా నగరమున సివిలు అధికారులు కొంచెము వెనుదిరుగగానే ఆ ప్రాంతములందలి నల్లవారందఱును మనకు ఎదురుతిరుగుదురు. ఇప్పటికే చాలా దుఃస్థితి కలిగినది. ముర్షిదాబాదులో కూడా సిపాయిలు చెప్పిన మాట వినుటలేదను వార్తలు వచ్చుచున్నవి. ఈ వార్త వారికెట్లు తెలిసినదో నాకు అర్థమగుటలేదు. లక్నో నగరమునందు ఇంగ్లీషు ఉద్యోగులు తమ నివాసముల దగ్గర ఫిరంగులనుంచి బందోబస్తు చేసికొనవలసినవారైరి. ఈ ముదుసలి యయోధ్యబేగములు చెయితుసింగుకు సహాయము పంపుట కూడా మనకు చుక్కయెదురైనదను భావములోనే సుమీ!' అని యాతడనెను.

తరువాత ఇంగ్లీషు సైనికదళములు చెయితుసింగు పైకిపోయి అతని కోటను పట్టుకొని అందులో దొరికిన 28 లక్షలను దోచుకొనిరి. అంతట శాంతి నెలకొనెను.

రాయవేలూరు పితూరి

మద్రాసు రాజధానికి 1803-1807 మధ్య గవర్నరుగా నుండిన విలియం బెంటింకుగారి అంగీకారముతో ఆ రాష్ట్రము యొక్క సర్వసేనానియైన సర్ జాన్ క్రాడక్కుగారు సైనిక నిబంధనలయొక్క పదియవ విధినిబట్టి సిపాయిలు కవాతు మైదానముపైకి వచ్చినప్పుడు అందరు నొకేవిధమైన దుస్తులను ధరించవలెననియు, వారు గడ్డములు నున్నగా గొరిగించుకొనవలెననియు, తలపైన క్రొత్తగా చర్మముతో తయారుచేయబడిన దొర టోపీలను ధరించవలెననియు, హిందువులు మామూలుగా ముఖములపై ధరించు బొట్టుగాని చెవులకు పెట్టుకొను పోగులుగాని ఉండరాదనియు శాసించెను. మహమ్మదీయులు గడ్డములను నున్నగా గొరిగించుకొనుట మతాచార విరుద్ధము.

హిందువులకు బొట్టు, చెవుల ప్రోగులు తీసివేయుట మతాచారమునకు విరుద్ధము. హిందువులు చర్మమును తాకినచో మైలపడుదుమనుకొందురు. మహమ్మదీయులా చర్మము అపవిత్రమైన పందితోలు కావచ్చునను అనుమానముతో దానిని ముట్టుకొనరు (Eighteen Fifty Seven. S.N. Sen. P.2). పాశ్చాత్యులైన పరంగీలు హిందువులను మహమ్మదీయులను ఇట్లు మతభ్రష్టులుగా చేసి, పరంగీల మతములో కలపదలచినారను అనుమానము సిపాయిలందరికిని కలిగెను.

భారతదేశమున మహమ్మదీయ ప్రభుత్వకాలమునందు హిందువులను బలవంతముగా మహమ్మదీయ మతమున కలుపుకొనుచుండిరి. అందువలన నీదొరతనములో కూడా దొరలు తమ మతమున కలుపుకొందురేమోయని అనుమానముండుట సహజము. కిరస్తానీమతమనగా దొరలు ధరించు దొర టోపీలను పెట్టుకొని గొడ్డు మాంసమును పంది మాంసమును తినుట, ఘాటైన సీమ సారాయమును త్రాగుటయు, శౌచవిధుల నుల్లంఘించుటయుననియు, ఈ కిరస్తానీ మతమిట్టిపనులు చేయు పరంగీల మతమే గాని నీతి నియమములు ఆస్తిక జిజ్ఞాసయు గలట్టి మతము కాదనియు దేశీయులనుకొనుచుండిరి. అందువలన నామతమున గలసినవారందరును అస్పృశ్యులు నపవిత్రులు నను భావముండెను. తాము మతభ్రష్టుల మగుదుమను భయోద్రేకములి సిపాయిలలో కలుగుటకీ పిచ్చియుత్తరువులే చాలియుండెను (Oxford History of India V. A. Smith. P. 610).

అంతట రాయవేలూరులోని దేశీయ సిపాయిలు 10-7-1806వ తేదీన తిరుగుబాటుచేసి, అక్కడి ఇంగ్లీషుజాతి సైనికోద్యోగులలో 19మందిని, జాతి సైనికులను 82మందిని తుపాకులతో కాల్చి వధించిరి. 91మందిని గాయపరచిరి. తరువాత ఆర్కాటు నుండి ఇంగ్లీషువారి సైనిక బలములు వచ్చి సిపాయిలను పట్టుకొని పితూరీనణచివేసిరి. ఉత్తరహిందుస్తానములోని మతావేశపరులైన వాహబీలను మహమ్మదీయులు తమ ఫకీరులను దక్షిణదేశమునకంపి ఇంగ్లీషువారిపట్ల ద్వేషభావము పురికొల్పుచుండిరనియు, అట్టి ఫకీరులలోనొకడు రాయవేలూరి బజారులలో కొంతకాలము నుండి తిరుగుచూ సిపాయిలలో నుద్రేకము కలిగించుచూ నీ ఇంగ్లీషు ప్రభుత్వము కూలిపోవునని చెప్పుచుండెననియు తెలియవచ్చెను. ఇంతేగాక ఆ సమయమున రాయవేలూరు కోటలో

టిప్పుసుల్తానుగారి కుమాళ్ళును కుటుంబమువారును రాజకీయఖయిదీలుగా నుంచబడియుండిరి. వారును వారి పరిజనులు నీ సిపాయిల తిరుగుబాటుకు కుట్రచేసిరని సైనికోద్యోగులనిరి. రాజకుటుంబమువారి మనుష్యులు సిపాయిలతో రహస్యంగా మాట్లాడుచుండినట్లును, ఈ పితూరీ జరిగినప్పుడు టిప్పుసుల్తాను గారి ఆకుపచ్చ జెండా ఎత్తబడినట్లును తెలిసినది. అయినను తరువాత జరిగిన విచారణ వలన, మద్రాసు రాజధానిలో కొత్తగా ప్రవేశపెట్టబడిన సైనిక నిబంధనల వలన సిపాయిలలో కలిగిన భయోద్రేకములే ఈ తిరుగుబాటుకు ముఖ్యమైన కారణమని తెలియవచ్చెను. అటుపిమ్మట నీ నిబంధనలను జారీచేసిన సర్వసేనానిని, విలియం బెంటింకుగారిని మద్రాసునుండి పని మాన్పించిరి.

మద్రాసులో చాలాకాలము గొప్ప ఉద్యోగములు చేసిన(సర్) తామస్ మన్రోగారు 4-9-1806వ తేదీన తన తండ్రికి లేఖ వ్రాయుచు, 'సిపాయిలు సైనికదుస్తులు ధరించినప్పుడు బొట్టుపెట్టుకొనరాదనియు, చెవులకు పోగులు ధరింపకూడదనియు, వారి బుగ్గలను నున్నగా గొరిగించుకొనవలెననియు, మీసముల నొకేరీతిగా కత్తిరించుకొనవలెననియు చేయబడిన ఉత్తరువులవలననే దేశీయ సిపాయిల పితూరీ జరిగినది. ఇది త్వరలోనే అణచివేయబడినప్పటికిని, ప్రపంచంలో నేజాతియొక్క ఆచార వ్యవహారములనుగాని తృణీకరించినప్పుడా జాతిలో కలుగు ఉద్రేకమువంటిదే యిది. మన బ్రిటీషు సైనికులందఱిని తలలు నున్నగా గొరిగించుకొనుడని శాసించినచో నేమి జరుగునో యూహింపుడు' అని వ్రాసిరి (Life and Letters of Sir Thomas Munro, Gleigh. Vol. 1. P. 305).

దేశీయ ప్రజలను క్రైస్తవ మతమున గలుపుకొనుటకై క్రైస్తవమత ప్రచారకులు చేయు ప్రయత్నములకు కుంపిణీ యధికారులు తోడ్పడినందువలననే అది జరిగినదని క్రమక్రమముగా బయల్పడెను.

1807వ సంవత్సరములో రెవరెండ్ సిడ్నీస్మిత్తుగారు ఎడింబరో రివ్యూలో వ్రాసిన లేఖనుబట్టి, 1805 మార్చి 31 తేదీన కొందఱు మిషనరీలు మద్రాసులోని కుంపిణీ యధికారులను సందర్శింపగా వారు గ్రామములందు ప్రచారము చేయుటకు సౌకర్యములు కలిగింతుమని వాగ్దానము చేసిరనియు,

క్రైస్తవమత ప్రచారపు కరపత్రములను ఉచితముగా సర్కారు ముద్రణాలయమున అచ్చొత్తించి యిచ్చుట కంగీకరించిరనియు తెలియుచున్నది. వేలూరు తిరుగుబాటుకు పూర్వము క్రైస్తవమత ప్రచారకులు సీమకు వ్రాసిన లేఖలో, తమకు మద్రాసు ప్రభుత్వమువారు మత ప్రచార విషయమున చేయుచున్న సహాయమును వివరించిరి (Rise of Christian power in India. Major B. D. Basu. p. 484.5).

ఎడింబరో రివ్యూలో నింకొక సంచికయందు, రాయవేలూరులో వధలు జరిగిన పదునైదుదినములకు మద్రాసులోని మత ప్రచారకులిట్లు వ్రాసిరి: `ఈ దేశములో స్థాపింపబడిన కుంపిణీ ప్రభుత్వమువారి వలన మాకు అన్ని విధములైన సహాయమును లభించినది. మేముగాని ఇతరులుగాని వారిని కోరిన కోర్కెలన్నిటిని వారు చెల్లించిరి. మేము యిక్కడికివచ్చుటకు వారు అనుమతిచ్చుట, మద్రాసు కోటలో మేము ప్రార్థనలు జరుపుటకంగీకరించి మాపనికి తోడ్పడుట, క్రైస్తవమత ప్రచారవర్గమువారు పనిచేయుటకవసరమైన వసతిని, నివేశనస్థలమును యిచ్చుట యను విషయములందు మనకే యిబ్బందియు కలుగకుండా కావలసిన సహాయము నెల్ల చేయుదురు. ఇది ఏసు క్రీస్తు ప్రభువు యొక్క దయయని తలచుచున్నాము. (Christianization of India. D.V. Siva Rao, Immortal Message May 1940.)

ఆ కాలమున స్వతంత్రులైన క్రైస్తవమత బోధకులు కొందరు తమ స్వంత బాధ్యతపైన మన దేశములో ప్రచారము చేయుటకు బయలుదేరివచ్చిరి. వీరు తమ యిచ్చవచ్చినరీతిగా మన మతములను దూషించుచు క్రైస్తవమతము లోనికి ప్రజలను కలుపవలెనని ప్రయత్నము చేయుచుండిరి. ఆ దేశీయల స్వభావమునుగూర్చియు వారి యాచారములనుగూర్చియు వారి దేవుళ్ళనుగూర్చియు చాలా అవమానకరముగా మాటలాడుచుండిరి. ఈ దేశీయులను కిరస్తానీమతమున కలుపుటకు కృషిచేయుట పుణ్యమను భావములో ధనవంతులట్టి మత బోధకులను ప్రోత్సహించి పంపిరి. వారు కుంపిణీ ప్రభుత్వమువారి యుద్యోగుల సహాయములో నిక్కడ ప్రచారము సాగించుచుండిరి. యుద్ధములు లేనప్పుడు సిపాయిలు తీరికగానుందురు గనుక వారికి మతబోధ చేయసాగిరి. తమ ప్రభువులైన కుంపిణీ బహదూర్‌వారి జాతివారని సిపాయిలు జమేదారులు కొన్నాళ్ళు ఓపికపట్టి వీరు

తమ మతమునెంత దూషించుచున్నను మర్యాదతో వినిరి. అదిచూచి వీరు మఱింత విజృంభించిరి. సిపాయిల మనస్సులో చాలా బాధకలిగెను. ఈ దుష్ప్రచారమునకు కుంపిణీవారు హర్షించుచున్నారనియు వారికి కూడా తమను మతభ్రష్టులుగా చేసి కిరస్తానీ మతమున కలుపునుద్దేశమున్నదనియు అనుమానపడిరి. అంతట నీ మద్రాసు రిగ్యులేషను నిబంధన వారి అనుమానములను స్థిరపరచెను. సిపాయిల మనస్సులకు కష్టము కలుగునట్లు వారి మతాచారములకు భంగము కలిగింపగల నిబంధనలను అమలుపరచి ఇంగ్లీషుదొరలీ రాయవేలూరు పితూరీని కొనితెచ్చుకొనిరి.

ఈ తిరుగుబాటును గూర్చి హెరియట్ మార్టిన్యూ 1857లో రచించిన బ్రిటిష్ రూల్ ఇన్ ఇండియా అను గ్రంథమున నిట్లు వ్రాసెను:

రాయవేలూరు పితూరీ జరుగుటకుముందిట్టివి జరుగునను సంగతి ఆంగ్లేయాధికారులకు కొన్ని సూచనలవలన తెలిసినప్పటికిని వారెట్టి చర్యయు తీసికొనలేదు. వీరు క్రొత్తగా అమలుజరిపిన నిబంధనలలో సిపాయిల కులాచారములకు సంబంధించిన బొట్టును, చెవులపోగులు తీసివేయవలెనను నిబంధనగాక వారు క్రొత్తగా ధరించవలెనని నిర్ణయించిన దొరటోపీ వంటిది ధరించినచో సిపాయిలు ఫరంగివారివలె నుందురని వారికి తోచెను. ఈ టోపీని పెట్టించుటలో వారు తమను మతభ్రష్టులుగా చేసి తరువాత కిరస్తానీ మతమున గలుపవలెనని ఉద్దేశించిరని సిపాయిలకు తోచెను. ఆ టోపీని పెట్టుకొనుటకు నిరాకరించిన సిపాయిలను కొందరిని మే నెలలో పట్టుకొని చిళ్ళలుగల కొరడాలతో చావగొట్టిరి. ఒక్కొక్క దెబ్బతినిన సిపాయియు, అతని బంధువర్గమును మిత్రులును కుంపిణీవారిపైన క్రోధము వహించి వారిని ద్వేషించుటలో ఆశ్చర్యం లేదు. అట్లు చావగొట్టిన సిపాయిలను కొందరినింకను సైనికవిధుల ప్రకారము శిక్షించుటకు మద్రాసుకు పంపిరి. కొందరు దూరదృష్టిగల ఉద్యోగులీ నిబంధనలను అమలు జరపక ఉపేక్షించిరి.

ఈ కుంపిణీవారు నిజముగనే ఈ విషయమున కుట్రచేసిరని సిపాయిలు తలచిరి. ఈ విషయమునుగూర్చి సిపాయిలు వారి బంధుమిత్రులును చర్చించుకొనుచుండిరి. ఆ యుత్తరువులను ప్రతిఘటించి బాధలనుభవించిన సిపాయిలు వీరులుగా పరిగణింపబడిరి.

ఈ విషయములో సిపాయిలు తిరుగుబాటు చేయుటకు కుట్ర చేయుచున్నారని ఒకడు ఇంగ్లీషుదొరకు చల్లగా చేరవేసెను. అయితే ఆనాటి దొరలు దేశభాషలను నేర్చుకొను ఓపికగలవారుగారు. అందువలన ఆ దొర దీనినిగూర్చి విచారింపుడని, కుట్రదారులలోనివారికే ఆ సిపాయిని వప్పగించెను. అంతట వారితడు చెప్పునది అసత్యమని తీర్మానించి వానిని ఖైదుచేసిరి.

ఈ క్రొత్త నిబంధనలను ప్రతిఘటించుటకొక సిపాయిల రహస్యసంఘ మేర్పాటుకాబడినట్లు కొన్ని వారముల క్రిందటనే కొందఱికి తెలిసెనుగాని, వారెట్టి చర్యయు తీసికొనలేదు.

రాయవేలూరు బజారులో నాకాలమున నొక ఫకీరు తిరుగుచు నీబ్రిటిషు రాజ్యము నశించునని బాహాటముగా చెప్పుచుండెను. ఆంగ్లేయాధికారులు వీనిని లెక్కచేయలేదు (British Rule in India. Harriet Martineau, 1857. pp 205-221). రాయవేలూరు వీధులలో తిరుగుచుండిన ఫకీరు వాహబీశాఖకు చెందినవాడే. ఆ కాలమున నీశాఖవారు భారతదేశమునందు కాఫరులైన ఇంగ్లీషువారిపైన యుద్ధము చేయవలెనని మహమ్మదీయులను ప్రోత్సహించుచుండిరి.

రాయవేలూరి తిరుగుబాటు జరుగుటకు ముందుకూడా 1857లో జరిగిన భారత స్వాతంత్ర్య యుద్ధమునకు పూర్వము వలెనే మద్రాసులో ఒక గ్రామమునుండి మఱియొక గ్రామమునకు చపాతీలను గోధుమరొట్టెలను పంపుచుండిరని, అందువలన నీఆచారములో నేదోయొక అంతరార్థమున్నదని అది తెలియుటలేదని తారన్ హిల్లుగారు వ్రాసిరి (The Personal Adventures of a Magistrate during the Mutiny 1857. P 2,3. Eighteen Fifty seven S. N. Sen P. 398).

(సశేషం)

రచన: దిగవల్లి వేంకట శివరావు

ఆగస్ట్ 2020

(మొదటిభాగంఇక్కడ చదవండి.)

1. బర్మా యుద్ధము

ఇంగ్లీషు కుంపినీవారి స్వాధీనములోనున్న వంగదేశపు సరిహద్దులలోనున్న అస్సాము రాజ్యమును బర్మారాజు సైన్యములాక్రమించగా ఇంగ్లీషువారికి కన్నుకుట్టెను. అంతట ఆ సరిహద్దులలో ఇంగ్లీషువారికి బర్మావారికి తగవులు ప్రారంభమయ్యెను. 1823 నవంబరులో ఇంగ్లీషువారి ఓడను ఒక సైనికాధికారిని బర్మావారు పట్టుకొన్నందువలన బర్మావారిపైన కుంపినీవారి గవర్నరు జనరల్ అమహరెస్టు యుద్ధము ప్రకటించెను. ఆ సమయమున వంగదేశములోని దేశీయ సిపాయిలు సముద్రము మీద ప్రయాణము చేసినచో తమ కులమువారు వెలివేయుదురని బర్మాకు పోవుటకు నిరాకరించిరి. మద్రాసులోని దేశీయ సిపాయిలు ఎట్టి అభ్యంతరము చెప్పక సముద్రయానము చేసిరి. ఆప్రకారమింగ్లీషువారు పంపిన నౌకాదళములు 1824 మే 10వ తేదీన రంగూను రేవుదగ్గర లంగరు వేసెను. అక్కడి ప్రజలు భయపడి అడవులలోనికి పారిపోయిరి. ఇంగ్లీషు సైన్యము రంగూనును పట్టుకొని ఆవానగరములో నున్న బర్మారాజుపైకి పోవదలచిరి కాని అడవులలోనున్న బర్మా ప్రజలు వారిపైన రహస్యయుద్ధము చేసి చాలా నష్టము కలిగించిరి. ఈ లోపుగా బర్మారాజు తన సేనానాయకుడైన మహాబొందూలా అధికారము క్రింద పంపిన సైన్యము అస్సాము సరిహద్దున గల నాప్ నదిని 1824 మే నెల ప్రారంభములో దాటి రామూకొండల దగ్గర ఇంగ్లీషు సైన్యమునోడించి వారి సేనాధిపతిని చంపెను. అంతట ఈ మహాబొందూలా సేనలు వచ్చి కలకత్తాపైన పడుచున్నవను వార్తలు ప్రబలి కలకత్తాలోని ఇంగ్లీషువారేగాక భారతదేశములోని కుంపినీరాజ్యము లోనివారెల్లరు హడలిపోయిరి. అయితే ఆ సమయమున రంగూను నింగ్లీషువారు పట్టుకొన్నందున బందూలాను వెనుకకు రమ్మని బర్మారాజు ఆజ్ఞాపించుటవలన ఇంగ్లీషు కుంపినీవారు బ్రతికిపోయిరి.



ఈ బర్మాయుద్ధము నందింగ్లీషువారికి కలిగిన అపజయమువలనను హిందూదేశములోని ప్రజలందును ప్రభుత్వమునందును కలిగిన భీతావహమునుగూర్చి 1824 జూన్ 8వ తేదీన సర్ చార్లెస్ మెట్‌కాఫ్‌గారు గవర్నరు జనరలుకు వ్రాసిన ఉత్తరమువలన తెలియుచున్నది.

“బర్మావారింత బాగా యుద్ధము చేయగలుగుదురని మనమనుకొనలేదు. మొదటి విజయము వారికి కలుగగానే వారికి చాలా బలము చేకూరినది. మనము మొదటిలోనే ఓడిపోయినందువలన మనసైన్యమును క్రుంగదీసినది. అపజయమెంత స్వల్పమైనదనుకొన్నను దీని ఫలితములు చాలాముఖ్యమైనవి. భారతదేశములోని కుంపినీవారి బ్రతుకంతయు మన సైన్యముల నిరంతర విజయములపైన నాధారపడియున్నది. ఇతరదేశములలోవలెగాక హిందూదేశ ప్రజలలో నిది చాలా కలవరము కలిగించెను. మనము తగినంత సైన్యమును యుద్ధరంగము దగ్గరనుంచుకొనలేదు. ఇట్టి సమయములో శత్రువులు మనలను ఓడించి మనపైకి వచ్చుచున్నారను వార్త ఢాకానగరములోను దూరములోనున్న కలకత్తాలోను గల ప్రజలలో భీతి కలిగించెను. సిరాజుద్దౌలా కాసీముబజారును కలకత్తాను పట్టుకొన్నప్పటినుండి ఇంతవరకింత భయము మనవారికెన్నడును కలుగలేదు. వంగదేశపురాజ్యపు తూర్పు పొలిమేర పొడవున మనకిప్పుడు బర్మావారితో పోరాటము కలిగినది. మన శత్రువులైన బర్మావారికి మంచి సైనికబలమేగాక ఉత్సాహముకూడా ఉన్నది. మనము కూడా తగిన సైనికబలమును చేర్చి ఈ పరాజయమును కూడదీసికొనవలెను. ఎంతటి చిన్న ఓటమి కలిగినను దానిని మనము కూడదీసికొనకపోయినచో హిందూదేశములో నింక మనము నిలువలేము.

మనకు ఈషణ్మాత్రము పరాజయము కలిగిననూ ఆ వార్త హిందూదేశములో నన్ని ప్రాంతములకు త్వరలో వ్యాపించును. ఇంతకాలము మనము అణచియుంచిన కోట్లకొలది జనులందరు మనలను కూలద్రోయుటకు ప్రయత్నింతురు."

అతడింకను ఇట్లు వ్రాసెను: "మన సైనిక బలమువలననే మన సామ్రాజ్యమీదేశములో నిలిచియున్నది. ఈ పునాదికేమాత్రము దెబ్బతగిలినను మనకు ఉపద్రవము రాగలదు. మనకెంత చిన్న ఓటమి కలిగినా ఆ పునాదికి దెబ్బతగిలినట్లే.

మనమెప్పుడు బలహీనులమై పడిపోవుదుమాయని హిందూదేశములోనివారందరును నిరంతరము ప్రతీక్షించుచున్నారు. మనము నాశనమైన దినమున హిందూదేశములోనివారందరును సంతోషించి ఉత్సవములు చేయుదురు. ఇటువంటివారీదేశమున లక్షోపలక్షలుగానున్నారు. మనము క్రిందికిజారుట మొదలిడినచో నికమనకు దిక్కుండదు. ఒక్కసారిగా మన రాజ్యము కూలిపోవును.

మన బలమంతయు దేశీయ సిపాయిల భక్తివిశ్వాసములపైన నాధారపడియున్నది. మనము ఎన్నడును ఎక్కడను ఓడిపోకపోరాడి జయపరంపరలను పొందుచున్నంతకాలమే వారికి మనయెడల భక్తివిశ్వాసములుండును. మనకెక్కడనైనను అపజయము కలిగినచో వారి భక్తివిశ్వాసములడుగంటును." అని సర్ చార్లెస్ మెట్కాఫ్ వ్రాసినాడు (Rise of Christian power, B. D. Basu. బ్రిటిష్ మహాయుగము, సం.2, పే. 909-910).

1824 తిరుగుబాటు - సిపాయిల వధ

హిందూదేశములో నింగ్లీషుకుంపినీవారు దేశీయ సిపాయిల సహాయమువలననే రాజ్యాక్రమణము చేసి దానిని నిలువబెట్టుకొనుచుండిరి. దేశీయ సిపాయిలు చాలా భక్తివిశ్వాసములతో కుంపినీవారి సేవచేయుచుండిరి.

ఈ దేశీయ సిపాయిల శాంతస్వభావము రాజభక్తి వినయవిధేయతలు, వారి గుణగణములను ఇంగ్లీషు సేనాధిపతులనేకులు ప్రశంసించియున్నారు. నిన్ను కొలువునుండి తీసివేసినామని అనుటకంటె

దేశీయసిపాయికి వేరే అవమానము శిక్ష అవసరములేదు. అయినను వీరికి తగిన జీతబత్తెములు లేవు. సౌకర్యములు లేవు. మామూలు రోజుకూలివానికిచ్చు మొత్తముకన్నను దేశీయ సిపాయికి తక్కువ జీతమిచ్చుచుండిరి. పాశ్చాత్య సైనికులు సేనలో చేరగానే వారికి ముందుగా కొంత మొత్తము సరంజామాకొరకిత్తురు. వారుండుటకు సర్కారువారు బారకీచులను కట్టించి వారిని మాంసాహారములో మేపుదురు. దేశీయ సిపాయిలు తలదాచుకొనుటకు ఎక్కడనో ఒక గుడిసె చూచుకొని అన్నవస్త్రములకు ఇబ్బందిపడుచు మీసములురాని తెల్లవారుద్యోగులై నెరసిన గెడ్డములుగల ముదుసలి దేశీయ సిపాయిలను చిటికిమాటికి తిట్టి చిన్నతప్పిదములకు కూడా ముక్కోణములకు కట్టి, కొరడాలతో చావగొట్టుదురు. దేశీయ సిపాయి ఎన్నాళ్ళు సేవచేసినను సుబేదారు మేజరు పదవికన్న హెచ్చుపదవినివ్వరు. ఇంగ్లీషు సైనికుడు త్వరలోనే గొప్ప జీతబత్తెములు గల కెప్తానులు కర్నలు జనరలు పదవిని పొందుదురు. తెల్లవారుచూపిన అవిధేయతను కప్పిపుచ్చుచుందురు.

పాశ్చాత్య సైనికులకు దేశీయ సిపాయిలకు గల తారతమ్యము అటులుండగా ఆ కాలములో బొంబాయి మద్రాసులోని దేశీయ సిపాయిల సైన్యమునకున్న జీతబత్తెములు వంగదేశములోని దేశీయ సిపాయిలకు లేకుండెను. ఐరోపా సైనికుడు తన మూటను తాను మోసికొని వెళ్ళడు. వారికొరకు బండ్లు ఎడ్లు గుఱ్ఱములు ప్రభుత్వమువారేర్పరచిరి. దేశీయ సిపాయి తన తుపాకిని 60 రౌండ్లు మందుగుండు తోటాల సంచిని తన బిచానా వంటసామాను దుస్తులు సహా పెద్దమూటను వీపున మోసికొని ఎన్ని మైళ్ళ దూరమైన నడువవలసియుండెను. అందువలన ఈ సిపాయిలకు గుండెజబ్బుచేసి వంగిపోవుచుండిరి. యుద్ధసమయములోను పోరాడుటకును దేశీయ సిపాయిలను బెదిరించి లొంగదీయుటకు తప్ప వంగదేశములోని ఇంగ్లీషు జాతి సైనికులు ఇతరకార్యములను చేయుటకు నుపయోగింపకుండిరి. వీరు సాధారణముగా పనిచేయక తప్పించుకొనుచుండిరి. ఎండలోను వర్షములోను పనిచేయలేకుండిరి. గవర్నరు జనరలుకును సర్వసేనాధిపతికిని పహరాకూడా దేశీయ సిపాయిల రెజిమెంటువారే చేయుచుండిరి. కలకత్తాలో గవర్నరు జనరలు భవనమునకు కాపలావారిలో దేశీయ సిపాయిల పటాలమువారు సగముమంది మిగిలినవారు

ఇంగ్లీషువారునుండిరి. అయితే వీరు ఎండ తప్పించుకొని నీడలో కాలక్షేపముచేయుచుందురు. సైనికశాఖ కార్యాలయములోని రికార్డులను కూడా దేశీయ సిపాయిలే చేరవేయుచుండిరి. ఇంగ్లీషుజాతి సైన్యమెక్కడికి తరలివెళ్ళినను వారితోపాటు చాకిరిచేయుటకు దేశీయ పటాలములను పంపుచుందురు.

దేశీయ సిపాయిలు తమ యిబ్బందులను పైయధికారులకెన్నోసారులు చెప్పుకొని మొఱపెట్టినను వారి బాధలనెవ్వరును తీర్చరైరి. ఇట్టి పరిస్థితులలో 1824లో బర్మాయుద్ధము తటస్థించినది. బారకుపూరులోనున్న 47వ దేశీయ పటాలమును యుద్ధరంగమునకు నడువవలసినదని ఉత్తరువులువచ్చెను. వారు సముద్రముపైన ప్రయాణములు చేసినచో వర్ణభ్రష్టులగుదుమను భయమువలన నాటుదారిని పోవుటకంగీకరించిరి. అయితే వారి సామానులను రవాణాచేయుటకుగాని వారికాహారపదార్థములు సరఫరా చేయుటకుగాని తగిన ఏర్పాటులను కుంపిని ప్రభుత్వమువారు చేయక ఆ సిపాయిలనే తగు ఏర్పాటులు చేసికొనవలసినదనిరి. ప్రయాణపు ఖర్చులను సిపాయిలు భరించుకొందుమని చెప్పినను మిలిటరీశాఖకు సంబంధించిన ఎడ్లను బండ్లను ఇచ్చుటకు వీలులేదని సరఫరాశాఖవారనిరి. ఈ పరిస్థితులలో మెట్టదారిని పోవీలుగాక సముద్రముమీదుగనే వీరిని కలకత్తానుండి రంగూనుకు పంపదలచినారను ఒక వార్త సిపాయిలకు తెలిసెను. ఈ పటాలములోనివారందరు ఉన్నతకులములకు చెందిన బ్రాహ్మణులు, క్షత్రియులు మొదలైన హిందువులు. వీరు సైనికకొలువులో చేరినపుడే తమను సముద్రయానము చేయుడని కోరరాదను షరతును తమ పూచీకత్తులో వ్రాసియుండిరి. ఆ షరతుకు భిన్నముగానిప్పుడు తమను సముద్రయానము చేయుడని కోరుట అన్యాయమని వారు అందుకంగీకరింపరైరి.

1824 అక్టోబరు 30వ తేదీన ఈ పటాలమును మైదానము మీద వరుసగానిలువబెట్టిరి. మూమూలుగా వీపులపైన వేసికొను మూటలనేల వేసికొనలేదని అధికారియడుగగా అవి పాతవై చిరిగిపోయినవని వారు నెమ్మదిగా చెప్పి తమకుగల ఇతర కష్టములను మఱలనొకమారు చెప్పుకొనిరి. ఓడలమీద పోవు షరతు తాము వ్రాసియిచ్చిన పత్రములలో లేదుగనుక తాము సముద్రయానముచేయజాలమనిరి. బండ్లు తోలువారికి ఇతరులకు రెట్టింపు

బత్తెములనిచ్చుచున్నందున తమకు కూడా అట్లు దయచేయింపుడనిరి. క్రొత్తదేశములో అన్ని వస్తువులు ప్రియముగానుండునని తెలియుచున్నదనియు అందువలన తమకు హెచ్చు బత్తెమునివ్వనిదే బ్రతుకజాలమనిరి. అంతట సైనికాధికారి అప్పటికూరకొని వారిని వెళ్ళిపొమ్మని చెప్పి పైయధికారులకీసంగతి చెప్పెను. ఆ మరునాటికి కలకత్తానుండి రెండు ఇంగ్లీషు పటాలములు ఫిరంగిదళము మరికొంత సైన్యము బారకుపూరులో దిగెను. నవంబరు 1వ తేదీన 47వ దేశీయ సిపాయిల పటాలమువారినందరిని మఱల మైదానము మీద నిలువబెట్టి కలకత్తా నుండి వచ్చిన సైన్యమును వారిచుట్టు నిలిపియుంచి వారివెనుక ఫిరంగులను బారుచేసియుంచిరి. అప్పుడాదేశీయ పటాలమువారు తమకు పట్టబోవు గతి గ్రహింపలేక తమ కష్టములను గూర్చి పారశీకభాషలో వ్రాసిన ఒక విన్నపమును సర్వసేనాధిపతియైన పేజెట్‌గారికి సమర్పించిరి. పేజెట్‌గారు చాలా కఠినుడు. సిపాయిలు తమ కష్టములనుగూర్చి చెప్పుకొనుటయె ఒక తప్పుగానెంచెను. అందులో ఒకవంక బర్మా యుద్ధము ప్రారంభమై కుంపినీరాజ్యమునకు ఘోరవిపత్తు వచ్చునట్లుండగా సైన్యములోని సిపాయిలిట్లు పేచీలుపెట్టుట తమ మతాచారములకు విరుద్ధమని సముద్రప్రయాణము చేయనిరాకరించుటయు కేవలము క్రమశిక్షణావిధులకు భంగముకలిగించునని వీరిని తగినరీతిగా శిక్షించవలెనని తలచి వారిని ఫిరంగులతో కాల్చివేయవలసినదని ఉత్తర్వుచేసెను. అట్టిది జరుగునని కలలోనైన అనుకొనని ఆ దురదృష్టవంతులైన సిపాయిలు చిందరవందరయి పారిపోవుచుండగా వారిని ఫిరంగిగుండ్లు తుత్తునియలుచేసివైచెను. ఈ వార్త హిందూదేశములోని దేశీయ సిపాయిల పటాలములవారు విని లోలోపల బాధపడిరి. అప్పటికేమనకపోయినను ఈయన్యాయము వారిలో తీవ్రమైన ద్వేషమును రగుల్కొల్పెను (Eighteen Fifty Seven, Surendranath Sen PP 3-5).

1824 తిరుగుబాటు - ప్రజలు

భారతదేశమునకు ప్రభువులైన ఆంగ్లేయ వర్తక కంపెనీవారు మిత్రభేదము చేసి, మోసము చేసి, దౌర్జన్యము చేసి, భారతదేశము నాక్రమించినారనియు, కేవలము ధనకాంక్ష చేత నెన్నో యన్యాయములు చేసిరనియు, వారి తాబేదారులును దుష్పరిపాలనము చేసి ప్రజలను పీడించి

ధనము లాగుచుండిరనియు, భారతీయులకన్న తామధికులమను స్వాతిశయముతోను, అహంకారముతోను మెలగుచు ప్రజలను నీచముగా జూచుచు అవమానించుచుండిరనియు, అందువలన ప్రజలలో విరోధభావము వ్యాపించి ఈ యాంగ్లేయ పరిపాలనము నుండి వెలువడుటకు తరుణము కొరకు వేచియుండిరనియు ఆ కాలమున భారతదేశమున నుద్యోగము చేసిన దొరలలోనే కొందరు అనుభవజ్ఞులు వ్రాసియున్నారు. అట్టివారిలో ఫ్రెడరిక్ జాన్‌షోరుగారొకరు. ఈయన ఉత్తరహిందుస్థానమున 17 సంవత్సరములు జిల్లాజడ్జి ఉద్యోగము చేసి భారతదేశ స్థితిగతులను గూర్చి 1832-1835 మధ్య ఇండియా గెజెటు పత్రిక కనేక వ్యాసములు వ్రాసిరి. అవి 1837లో Notes on Indian Affairs అను పేరున రెండు సంపుటులుగా ప్రకటింపబడినవి.

ఆంగ్ల ప్రభుత్వము పట్ల భారతీయుల భావములను గూర్చి 1833 సం. ఏప్రిలు 6వ తేదీన వారిట్లు వ్రాసిరి: "భారతదేశ వ్యవహారములను గూర్చి నేను వ్రాయుటలో ఇంగ్లీషుపరిపాలకులపట్ల భారతీయులభావము లెట్లున్నవను విషయమును గూర్చి నేను పలుమార్లు సూచించియున్నాను. పలువురనుకొనునట్లే ప్రజల భావములు మన కనుకూలముగా లేవని స్పష్టముగా చెప్పియున్నాను. ఈ విషయమును గూర్చి మనలో ఉన్నంత అజ్ఞానము పొరపాటు అభిప్రాయములు నింకేవిషయముననను లేవు.

ఇంగ్లీషు పరిపాలన ప్రజానురంజకముగా నున్నదనియు, ఆంగ్లేయుల శీలమును గూర్చి భారతీయప్రజలకు చాల మంచియభిప్రాయము కలదనియు చాటుచుండుటయు, దేశీయరాజుల ఆక్రమములును వారి నిరంకుశత్వమును ప్రజాపీడనమును గూర్చియు చెప్పి, ఈ తారతమ్యమును జూపి, ప్రశంసించుచుండుటయు ఇంగ్లీషువారికి పరిపాటి యైపోయినది.

మన ఆంగ్లేయ ప్రభుత్వముపట్ల ప్రజలు అసంతృప్తిని జెందియుండుటకు గల కారణములలో ముఖ్యమైనవానిని కొన్నిటిని సూచించెదను. అన్నిటికన్న ముఖ్యకారణము నేనీవరకు వ్రాసినట్లుగా ఆంగ్లేయుల స్వాతిశయము, జాత్యహంకారము దేశీయులతో కలసిమెలసి ప్రవర్తించినచో తమ గౌరవమునకు భంగకరమను దురభిప్రాయముతో ప్రజలతో సంబంధము లేకుండా తొలగియుండుట.

ఈ ప్రవర్తనమే ప్రజల యాంతరంగికభావములు మనవారికి తెలియకపోవుటకు కారణముగ నున్నది. దేశీయులతో సంబంధము లేక మన ప్రపంచములోనే మనము మెలగుచున్నందున మన భావములు ప్రవర్తనమును సంకుచితములై స్వార్థపరత్వము వర్ధిల్లి ఇష్టానిష్టములు పెరిగిపోయినవి. కేవలము ధనకాంక్ష వలనను లాభము పొందు దురుద్దేశ్యముతోను మనల నాశ్రయించి తిరుగు భారతీయులు కొందరు సర్వదా మనలను స్తుతించుచు మనలోపములకు దుర్గుణములకు దోహదము చేయుచుందురు. మానవ స్వభావమును గ్రహించుటలో భారతీయులు కడు నేర్పరులు. గొప్పవారిపై నాధారపడి జీవించు వృత్తికులములవలెను, కాసావారివలెను వీరాంగ్లేయోద్యోగుల నెల్లప్పుడును పొగడుచు ఈ దేశమును గూర్చి వారికి గల దురభిప్రాయములు సరియైనవేయని తాము నమ్ముచున్నట్లు నటించుచు తమ్ము నేలు ప్రభువుల ముఖవిన్యాసముల కనుగుణంగా నడుచుచుందురు. మెరమెచ్చులు మొగము మెప్పులు చేసి వారినుబ్బించుట ఈ స్వార్థపరుల కవసరమైన కృత్యమే కదా!

తమ స్వదేశీయులిద్రోహుల నేవగించుకొనుచున్నను ప్రభుత్వము వలన వీరు లాభము పొందుదురు గనుక, ప్రభుత్వము యొక్క అనుగ్రహము పొందుటకు వీరు అవలంబింపని విధానములుండవు. వీరు సత్యమును తారుమారుచేయుటలో నాశ్చర్యములేదుగాని, ఈ వ్యక్తుల నీచత్వమును బాగుగా నెఱిగియుండి వీరిని గర్హించు ఈ ప్రభుత్వమువారు వీరి యభిప్రాయములను తిన్నగా విమర్శింపకయే వీరిని స్వీకరించుటమాత్రము ఆశ్చర్యకరముగనే యున్నది. అనుదినము జరుగుచున్న విషయమే యిది.

అధికారగర్వమున మునిగియుండక, ప్రజలతో కొంచెము కలసిమెలసి చరించినవారికి మాత్రము ప్రజల యాంతర్యము బాగుగా తెలియును. ఈ విషయమును గూర్చి కొంచెము నిష్పక్షపాతముగా యోచించినచో నీ ప్రజల కిట్టి విరోధభావములుండుటలో నాశ్చర్యము లేదని తెలియగలదు. ఏలనగా నీబ్రిటిష్ పరిపాలనమున ప్రజల స్థితి యెట్లున్నదో చూడుడు: యుద్ధము యొక్క అదృష్ట ఫలితములవలననో, లేదా తమకేవిధముగాను సంబంధము లేని రాజకీయమైన ఏర్పాటులను బట్టియో ఈ ప్రజలు మన పరిపాలన క్రిందకి వచ్చినారు. ఇంక మనపరిపాలనావిధాన మన్ననో

కేవలము స్వార్థపరత్వముతోనూ స్వాతిశయముతోను గూడి వారినేలుచున్నది. ఈ ప్రజల కన్నుల యెదుటనే క్రమక్రమముగా ఆయేటికాయేడు వీరి యధికారమును గౌరవమును సంపదయు క్షీణించిపోవుచున్నవి. వీరినేలిన దేశీయరాజులు రాజప్రతినిధులు నాశనమైపోవుచున్నారు. ఆంగ్లప్రభుత్వమువారి దురాశవలన దుష్పరిపాలనవలన జనసామాన్యము దరిద్రులగుచున్నారు.

ఇంగ్లీషువానికి ప్రసాదింపవీలుగల ప్రతియుద్యోగము దేశీయులకు లేకుండచేసిరి. ఈ దేశ వ్యవహారములను పూర్వము వంశపారంపర్యముగ చక్కబెట్టుచుండిన ప్రతి దేశీయ సంస్థయు నాశనము చేయబడినది. పూర్వమీదేశ ప్రజలు తమ వివాదములను పరిష్కరించుకొనుటకేర్పడిన పంచాయతీ ధర్మసభలు తీసివేసి, అసమర్థమును అత్యధిక ధనవ్యయకారణమునైన యొక కొత్త న్యాయపరిపాలనావిధానమును స్థాపించినారు. న్యాయపరిపాలనమను పేరును గూడ ఇది సార్థకపరచుట లేదు. దీనివలన అన్యాయములును ప్రజాపీడనమును దేశములో పెచ్చుపెరిగినవి. ఈ బ్రిటిషు ప్రభుత్వము వలన భారతీయులనుభవించు సౌఖ్యములివి. ఆంగ్లేయవ్యక్తులవలన వారు పొందు గౌరవాదరణములైన బాగున్నవాయని చూచినచో దేశీయులతోడి సామాన్య సంభాణములందు కూడా ఈ యాంగ్లేయులు గర్వమును గనబరచుటయు స్వాతిశయభావములను గనబరచుటయు తమ పట్ల మర్యాదగను గౌరవముగను బ్రవర్తించు దేశీయుల నీ యాంగ్లేయులు లెక్కసేయక తృణీకరించుట నీచముగ జూచి అగౌరవపరచుట గూడ సర్వసామాన్యముగ జరుగుచున్నవని నే నీవరకే చెప్పియున్నాను. ఈ భారతీయులెంతో శాంతముగను ఓరిమితో నీ యవమానములను తిరస్కారములను భరించుచున్నారు. ఆంగ్లేయోద్యోగులలో నెవరైన కొందరు ప్రజలపట్ల సానుభూతి గనబరచువారున్నను ఆంగ్లపరిపాలనా విధానమును బట్టి ఉద్యోగులను తరచుగా బదలాయింపులు చేయుచుందురు గనుక అట్టి ఉద్యోగులతోస్నేహ భావమును పెంపొందించుకొనుటకు ప్రజల కవకాశములు కలుగవు. ఆంగ్లేయుల ప్రవర్తనను బట్టి చర్యలనుబట్టి వారిపట్ల భారతీయులు స్నేహభావము కలిగి యుండుటకు హెచ్చు అవకాశములున్నవో లేవో గ్రహించుటకు చరిత్రకారుల రచనలు ముఖ్యముగా జేమ్సుమిల్లు గారి హిందుదేశచరిత్రను చదువవచ్చును.

ఈ భారతీయులు మనలను ద్వేషించునది మనము విజాతీయుల మైనందువల్ల మాత్రమునగాని, వారిని మనము జయించినందునగాని కాదు. జయింపదలచిన దేశములోని ప్రజలను రూపుమాపదలుచుకున్న ఘోరమైన సందర్భమున దప్ప ప్రపంచములోని దేశాక్రమణల చరిత్రలో నెచ్చటను కనివిని యెరుగని విధముగ నీపాలితప్రజలను దరిద్రులుగను పతితులుగను జేసినామను కారణముననే వారు మనలను ద్వేషించుచున్నారు (పే. 148). నేననేక దేశీయ స్వతంత్రరాజుల రాజ్యములు తిరిగి జూచితిని. అన్నిటికన్నను ముఖ్యముగా బ్రిటిష్‌వారి యధికారమునకులోబడుటను వారు హర్షించుటలేదని నేను గట్టిగా చెప్పగలను (పే. 151). సర్వకాల సర్వావస్థలయందు మన సైన్యములప్రమత్తత వహించియున్నందువలననే దేశమున తిరుగుబాటు జరగకుండ నున్నదను సంగతిని అందరు అంగీకరించకున్నారు. అవకాశమున్నప్పుడెల్లను అధికారతిరస్కారము కనబడుచునే యున్నదనుట కనేక ఉదాహరణములున్నవి. ప్రతి తిరుగుబాటుకును కల్లోలమునకును నేదో యొక కారణముండితీరునను సంగతి విచారించినవారికి తెలియగలదు. అసంతృప్తికి నిజమైన కారణములు లేని తిరుగుబాటులరుదుగా నుండును. ఇటీవల జరిగిన కోల్ తిరుగుబాటులో చాల మానవప్రాణములు నష్టమైనవి. ప్రభుత్వమునకు చాల సొమ్ము వ్యయమైనది. అప్రియమైన సంగతులనెంతకప్పిపుచ్చినను, ఎందరు దానిని కాదనినను ఈ తిరుగుబాటునకు నిజమైన కారణము రాజోద్యోగులగు దేశీయులు చేసిన ప్రజాపీడనము, దోపిడియునని బయల్పడినది. ఈ యుద్యోగులు లంచములు గ్రహించి, తమ యధికారమును దుర్వినియోగము చేసి కొందరికి మద్దతుచేసిరి.

1824లో ఉత్తరహిందుస్థానములోని (upper provinces) బ్రిటిషురాష్ట్రము లన్నిటిలోను కలిగిన కల్లోలములకు గూడ నిదియే నిజమైన కారణము. కొంచముగనో గొప్పగనో ప్రభుత్వము పట్ల ప్రజలకు విరోధభావము చూపని జిల్లా యొక్కటియైనను లేదని చెప్పవచ్చును. దీనికి కారణములు చూపుటకు కొందరు ప్రయత్నించిన సంగతి నేనెరుగుదును. బర్మా యుద్ధములో మనకు అపజయములు కలిగినందున మన సైన్యముల నక్కడికి బంపవలసివచ్చుటయే కారణమనియు తిరుగుబాటు చేసి సాగిన ముఠాలవారు దోపిడికొరకు తిరుగు యెవరో బందిపోటుగాండ్రేగాని అసంతృప్తి చెందిన

ప్రజలుగారనియు చెప్పజూచిరి. ఇవన్నియుగూడ కారణములేయని యంగీకరింపవచ్చునుగాని మన పరిపాలనమున నీదేశీయులంత సౌఖ్యము అనుభవించుచున్నచో మన యధికారమును ధిక్కరించుటలో వీరందరునింత యుత్సాహముతో నేల నేకీభవించుచున్నారు? ఉత్తర పరగణాలలోనెల్ల ఒక్క ముఖ్యభూస్వామియైనను ప్రభుత్వమువారికి సాయముచేయ రాలేదేమి?

దోపిడిసొమ్ములో కొంత పాలు పొందవచ్చునను నాసతో కొందరు బందిపోటుగాండ్రు తిరుగుబాటులో చేరినమాట నిజమేయని యొప్పుకొందము. అయితే ప్రజల ప్రవర్తన మెట్లున్నది? ఈ దోపిడి దొంగలకు మొదటి గెలుపు కలుగగానే దేశములోని ప్రజలలో పై తరగతులవారు కూడా చాలామంది వారితో కలసిరి. అంతట నీసమూహము యొక్క యుద్దేశ్యము కేవలము దోపిడిగాక ప్రభుత్వాధికార ధిక్కారముగనే పరిణమించినది. దేశమందంతటను అమితోత్సాముతో "ఈ ఇంగ్లీషువారి రాజరిక మంతరించినది! ఇంగ్లీషువారు నాశనమైపోవుదురుగాక!" అను కేకలు ప్రతిధ్వనించెను. కల్లోలము నణచుటకు తోడ్పడు పద్ధతి ఈ ప్రజలలో లేదనియు, ఆ పనిని మన పోలీసువారికి సైన్యములకే వదలి ప్రజలు తొలగియున్నారనియు చెప్పి, సరిపెట్టుకున్నందువలన లాభము లేదు. స్వదేశరాజ్యములలో కల్లోలములు జరిగినప్పుడు పలుకుబడి కలవారు తమ పరిజనులను, రైతులను ప్రోగుచేసి ప్రభుత్వమునకు బాసటయై నిలిచిన యుదాహరణము లెన్నియైన నీదేశచరిత్రలో కనపడుచున్నవి. పైన చెప్పిన కల్లోలముల సమయమున మాత్రమిందుకు భిన్నముగా జరిగినది. ప్రజలు కేవలము దూరముగా తొలగి యూరకొని మాత్రమే యుండలేదు. సర్వసాధారణముగా ఇంగ్లీషు మేజస్ట్రేటుల చుట్టుచుట్టు తిరుగుచుండువారుగూడ ఈ కల్లోలము ప్రారంభము కాగానే వివిధ మేజస్ట్రేటులను వదలిపెట్టి, తమ ప్రదేశములలో తమ పలుకుబడి నుపయోగించు నెపమున తమతమ యిండ్లకు జని అక్కడ మనుష్యులను ప్రోగుచేయసాగిరి.

కాని ఈ మనుష్యుల నెందుకు ప్రోగుచేసిరి? తాము సంసిద్ధులైయుండి తరుణము రాగానే తమ ప్రభుత్వమునకు వ్యతిరేకముగా నుపయోగించుటకే! ఇట్టివారు కొంతమంది యట్లెదురు తిరిగిరి. శాంతిభద్రతలను కాపాడుటకు ఆ సమయమున వెంటనే తగుచర్య తీసికొనకపోయియుండినను, పితూరిదారులకును, ప్రభుత్వ బలములకును జరిగిన మొదటిపోరులో అదృష్టవశమున

ప్రభుత్వమునకు కలిగిన జయము చేకూరకుండినను, లేదా కొలది దినముల ఆలస్యము జరిగి యుండినను తీవ్రమైన పెద్ద తిరుగబాటు బయలుదేరియుండి దాని నణచుటకు మనకు ఉత్తర పరగణాలలోగల సైన్యములనెల్ల ఉపయోగింపవలసి వచ్చియుండును-మన యధికారము భగ్నమై యుండును. ఆ సమయమున ప్రభుత్వము వారికి వివిధజిల్లాల యధికారులకు జరిగిన ఉత్తరప్రత్యుత్తరములను నేను జూచియున్నాను. సహరాన్‌పూరునుండి వచ్చిన జాబులో నిట్లు వ్రాయబడినది. 'దోపిడిగాండ్ల గుంపొకటి ముందుగా లూటీ కొరకు బయలుదేరినది. వారికి కొంత జయము చేకూరగనే ఆగుంపులో నితర గ్రామస్థులు చేరిరి. మరికొన్ని దోపిళ్ళు జరిగినవి. అంతట కొలదిదినములలో వీరిసంఖ్య 1200 మందికి పెరిగినది. ఆ జిల్లాలలోని ప్రధానభూస్వామి వీరితో చేరినాడు. వీరిని తనకోటలోని కాహ్వానించి బహిరంగముగనే ప్రభుత్వమును ధిక్కరించినాడు. ఈ పితూరీదారులో నొకడు రాజబిరుదు దాల్చినాడు. ఆసమయమున ఆంగ్లేయ ప్రభుత్వసైన్యము వచ్చి తారసిల్లినది. ఇట్లు జరుగుట కింకొక దిన మాలస్యమైనను పితూరీలో మూడువేలమంది చేరియుందురు. అప్పటికే పితూరీలో చేరుటకొరకు ఏబదిమంది మొదలు మూడువందలమంది వరకుగల ముఠాలేర్పడి యుండెనని బయల్పడినది. మన సైన్యములకు మొదటి తాకిడిలో నపజయము కలిగియుండినచో యెంత బీభత్సము జరిగియుండెడిదో చెప్పశక్యముగాదు'. ఈపైన చెప్పిన సంగతులు ప్రభుత్వమువారు కాదనలేదు సరికదా, నిజమేయని ఒప్పుకున్నారు. ఈ కల్లోలమున శ్రమపడినవారిని మెచ్చుకున్నారు. ఇది గొప్పయదృష్టమే. ఏలన స్థానికోద్యోగులనవసరముగా తొందరపడినారనియు అవసరమైనదాని కన్న ఎక్కుడు తీవ్రమైన చర్యలు తీసికొన్నారనియు చెప్పుచుండుట ప్రభుత్వమువారికి అలవాటు. తిరుగుబాటు యొక్క లక్షణములలో నొకటి అనుమానమును పెంపొదించుట. ప్రభుత్వము యొక్క స్థితిగతులంత బాగుగలేవను పుకారు బయలుదేరెను.

ఓరిమిగల వంగదేశీయులకన్న శూరత్వముగల ఉత్తరపరిగణాలవారిలో మాత్రమే ఈ భావములున్నవనుకొనుట పొరపాటు. దిగువరాష్ట్రములలో గూడ తిరుగబాటు సూచనలు పొడసూపియే యున్నవి. వారన్ హేస్టింగ్సుకును కాశీరాజుకును తగవులు కలిగిన కాలమున ఒకమారు

వారన్ హేస్టింగ్సు చనిపోయెనను పుకారు బయలుదేరెను. అంతట వంగరాష్ట్రములో అనేక జిల్లాలలో ముఖ్యముగా రాజషాయి, బీర్భూమ్ జిల్లాలలో కల్లోలములు బయలుదేరెను. రివిన్యూ వసూలు చాలారోజుల వరకును ఆగిపోయెను. ఆంగ్లేయోద్యోగుల యధికారము కొన్నాళ్ళు ఎందుకును పనికిరాకపోయెను (158-161).

ఆంగ్లేయులి దేశప్రజలలో నేమాత్రపు పలుకుబడి కలరనునది దీనికి దగ్గర సంబంధము గల విషయము. బ్రిటీష్ ప్రభుత్వమువారు అవలంబించిన విధానమువలన ప్రజలపైన సివిలు ఉద్యోగులకు పలుకుబడి యుండుట కవకాశములు కనబడుటలేదు.

దేశములోని రాజుల యధికారమును ఆంగ్లేయులు తీసివేసిరి. వారి సంస్థానములు ఎస్టేటులు లాగికొని, వారికి మనువర్తులిచ్చి, మూలకూర్చుండబెట్టిరి. ఏ కార్యము చేయుటకు నుత్సాహము లేక ఏ సందర్భములోను పైకివచ్చుట కవకాశము లేకుండనున్నారు. పరువుప్రతిష్ఠలుగల భూస్వాముల పైన అత్యధికశిస్తులు విధించుటవలనను వారసులమధ్య పంపిణీవలనను వారు దారిద్ర్యమున బడిపోయినారు. విడదీసి పాలించుమను కుటిలరాజ్యనీతి పరిపూర్ణరూపము దాల్చినది. కొలదిమంది వర్తకులు అంగళ్ళవారు తప్ప ఉత్తర రాష్ట్రములలో ధనవంతులగు దేశీయులే కరవైరి. ఆంగ్లేయ ప్రభువులు వీరితో సంబంధము లేకుండ వేరుగానుందురు. అందువలన అమెరికాలోని నీగ్రోబానిసలకును వారి తెల్లయజమానికిగల సంబంధమే యిక్కడి దేశీయులకును ఆంగ్లేయప్రభువుల మధ్య ఏర్పడినది.

ఇట్టి స్థితిలో నాంగ్లేయులకీ ప్రజలలో నెట్టి పలుకుబడియుండును? భయము వల్ల నేర్పడిన భక్తియేగాని ప్రేమవలన నేర్పడిన విశ్వాసము లేదు. తమ అధికారమును సంపదను హరించి తమ్ము నాశనము చేసిన ఈ ఆంగ్ల ప్రభుత్వము నీ ప్రజలు ప్రేమింతురా? తమ గౌరవమును తీసివేసి అధోగతిలోనికి దింపినవారిని వీరు మన్నింతురా? ఇట్లు చెడినవారి బంధుగులు స్నేహితులు పరివారజనములు వీరిని జూచి జాలిపడి లోలోపల మనలను తిట్టకుందురా? పూర్వకాలమున నెన్నడును లేనంత హెచ్చుగా పన్నులు విధింపబడుచుండగా, జనసామాన్యముగూడ

వీరందరితోపాటు మనలను జూచి ద్వేషించకుందురా? ప్రజలకు పరిపాలనము నందావంతయైన ప్రసక్తిలేకుండ జేయుటయేగాక జనులలో ఉన్న తరగతుల నెవిధముగా నాశనము చేసి, ఈ దేశమున బ్రిటిష్ పరిపాలనమును స్థాపించుటవలననిది తప్పనిసరియైనదని చెప్పజూతురు. కానీ ఆంగ్లేయులీదేశము నాక్రమించుటవలన నీయకృత్యములు చేయవలసినపని యెంతమాత్రమును లేదు. దేశములోని ఉన్నత తరగతులకును ముఖ్యముగా పెద్ద భూస్వాములకును వారికిదివరకుండిన అధికారములు సందర్భానుసారముగా కొంత మార్పుజేసియైన పరిపాలించుటలో వారి నుపయోగించుకొని యున్నచో మనము వారి ద్వేషమునకు పాత్రులము కాకుండ నుండుటయేగాక ఆపద సమయమున మనము వారి సహాయము యొక్క లాభమును పలుకుబడి యొక్క లాభమును వారి బందుగులు స్నేహితులు పరిజనుల తోడ్పాటును గూడ పొందియుందుము. భారతీయుని చేతిలో నెట్టి యధికారముగాని యుండుటను సహింపని ధోరణి పెచ్చుపెరిగి, యిట్టి విపరీతస్థితికి తెచ్చినది. ఒక రాష్ట్రము మనచేతులలో పడగనే ఈ దుఃఖపుస్థితి నెట్టి తారతమ్యము లేక అందరికిని దాపురించుచున్నది. మనకు సాయముచేసినవారు మనల నెదిరించినవారుగూడ మనవలన సమానాదరణమునే పొందుచున్నారు. దేశప్రజలందరు నీమాట చెప్పుకొనుట నేను స్వయముగా వినియున్నాను (162-163).

భారతదేశమున బ్రిటిష్ ప్రభుత్వముయొక్క స్థిరత్వమును గూర్చి కొన్నిమాటలు చెప్పెదను. ఆంగ్లపరిపాలన మీదేశమున కదల్చుటకు వీలులేనంత గట్టిగా స్థిరపడినదని చాలామంది యభిప్రాయము. మన యధికారముపట్ల తిరుగుబాటు కలిగిన కలుగవచ్చునుగాని, అది చాలా దూరపు సంగతియని తలచి ఆ సంగతినే ఆలోచింపరు. దేశీయ ప్రభుత్వములలో నైకమత్యము లేకపోవుటవలనను తగిన బలముగల పరరాజ్య ప్రభుత్వములు లేకపోవుట వలనను మనకేభయమునులేదని యనుచుందురుగాని, కొందరు మాత్రమింకొక విధముగా తలచుచున్నారు. సమర్థులైన గ్రంథకర్తలు చాలమంది అట్టిపరిస్థితి త్వరలోనే కలుగవచ్చనియు అభిప్రాయపడియున్నారు*. మన సామ్రాజ్యము ఒక గొప్పవరదలో మేటవేసిన ఇసుకతిప్పవలె నేర్పడినది. స్వతస్సిద్ధముగా దీనిలో స్థిరత్వము లేదు. దీనిని స్థిరపరచుటకు వలసిన పనులును

మనము చేయలేదు. మనము దీని చుట్టు గట్లు వేయలేదు. గొప్పవేళ్ళు పారి గట్టిచేయగల వృక్షములు నాటలేదు. ఈ సామ్రాజ్యమువైపునకు దృష్టి మరల్చినవారందరును కేవలము దీని నుండి ఎంత బంగారము తవ్వి ఎత్తుకొనిపోవ వీలుగలదా యనిమాత్రమే ఆలోచించినారు. క్రొత్త ఇసుక ప్రోగులు పోసి, మరమ్మతు చేయుటకప్పుడప్పుడు కొందరుద్యోగులను నియమించిరి. ఇది తాత్కాలికముగా కొంత ఉపయోగించినను, ఈ మహానిర్మాణము దాని యొక్క బరువుకే అది కృంగిపోవునట్లున్నది. లేదా, మరియొక మహాప్రవాహ సమయమున కోసుకుపోవునట్లున్నది. హాలెండు దేశములో సముద్రములోనికి కట్టిన 'డైకు'లను గట్టి అడ్డుకట్టలలో నొకటి ఒక యెలుక కన్నమువలన పాడై కొట్టుకొనిపోయినది. ఈ దేశమునకు వాటిల్లగల ముప్పు దేశీయరాజుల గూడుపుఠాణీవలనగాని ముందుగా ఆలోచించి చేయు తిరుగుబాటువలన గాని కలుగునని నేను తలంపను. మనమెవ్వరము అనుకొనని సమయమున నది తటస్థించును. ఏదో యొక చిన్న కలవరములో నది యుద్భవించును. తమ్ము అణచుటకు పంపబడిన చిన్న సైన్యమును పితూరీదారులోడించిన అదృష్టములలో నది యుద్భవించును. అంతట అంటుకొనిన అడవివలె భావములు చెలరేగి, ఆర్పుటకు వీలులేనట్లుగా దేశములో నంతటను వ్యాపించును (165-166).

(*1833లో షోరుగారు చెప్పిన జోస్యము త్వరలోనే ఫలించినది. 1857లో భారత స్వాతంత్ర్యసమరము జరిగినది.)

బ్రిటిష్ పరిపాలనము శ్రేష్ఠమైనదను సంగతియు దానివలన ప్రజలు పొందుచున్నారను లాభములను మనము గోడలపైన చిత్రించు స్వకపోలకల్పితపు సంగతులేగాని, వేరుకావు. ప్రజలు ఘోషించుచున్న బాధలను అన్యాయములను మాన్పగలవారు ముందుగనే ఈ హెచ్చరికను గమనింపవలెను. ఈ దేశాక్రమణమును జేయుటలో నేయన్యాయములున్నను దీనినిప్పుడు మన చేతులలో నుంచుకొనుటలో మాత్రము పరమార్థము నాలోచించవలెను. ప్రజల యభీష్టములకు వ్యతిరేకముగా సైనిక బలముచేతగాక, ప్రజానురంజకముగా వారి భక్తి విశ్వాసములను పొందుట మూలముననే మనము (సశేషం)

భారత స్వాతంత్ర్య సమరములు: 1757-1857

రచన: దిగవల్లి వేంకట శివరావు

సెప్టెంబర్ 2020

(ఈ వ్యాసపు మొదటిభాగంఇక్కడ; రెండవభాగం ఇక్కడ చదవండి.)

ఆదివాసుల యుద్ధములు: 1785-1858

ఇంగ్లీషువారు మనదేశమునకు రాకపూర్వము అమూల్యములైన ఖనిజ వృక్ష జంతు పక్షి సంపద తోడు అపూర్వ వస్తుజాలములతోను వివిధ ఆచారములుగల ఆదివాసులైన కొండ అడవి జాతులలతో నిండియున్న మహారణ్యములనేకములు మనదేశములోనుండెను.



ఆంగ్లేయులీయాటవిక సంపదను చేజిక్కించుకొని లాభమును పొందుటకై అనేక ఉపాయములనాలోచించి అందలి యాటవిక జనమును నయమునను భయమునను మారుమూలలకు తరిమి, మహావృక్షములను ఛేదించి వన్యమృగములను వధించి అడవులలోని దంతములు కొమ్ములు చర్మములు దారువులను గృహనిర్మాణమునకు గృహోపకరణములకు పరిశ్రమలకు వైద్యమునకు పనికివచ్చు వివిధ వస్తుజాలమును తరలించి వానిని విక్రయించి వ్యాపారమువలన లాభములను పొందుచు తుదకాయడవులను తమ స్వంత ఆస్తిగా చేసికొని

అందెవ్వరును ప్రవేశించకుండా వానిని 'రిజర్వు ఫారెస్టులు'గాను సంరక్షిత అరణ్యములుగాను ప్రత్యేకింపు చేసి అనేక కఠినశాసనవిధులను నిర్మించి అమితలాభములార్జించిరి.

ఆంగ్లేయులు తుపాకులతో వేటాడుటవలన మనదేశములోని అడవియేనుగులు ఖడ్గమృగములు మొదలైన జంతువులును పక్షిజాతులును కొన్ని రూపులేకుండాపోయినవి. సింహములు, పెద్దపులులు మొదలైన వన్యమృగముల సంఖ్య తగ్గిపోయినది. వారు తరలించిన దారువులకు దంతములకు కొమ్ములకు చర్మములకు లెక్కలేదు. ఇంగ్లీషువారు వర్తకము చేయుచున్న కాలమున నీదేశీయ రాజులను నవాబులను ఆశ్రయించి ఈ ఆటవిక వస్తువులను తరలించి సర్వమక్తా వ్యాపారము చేయుచు దేశీయులతో పోటీచేసి వారికి జీవనాధారము లేకుండా చేసిరి.

ఆంగ్లేయులు రాజ్యాధికారము వహించగానే ఈ ఆటవిక సంపదను తరలించుటకై కొన్ని పద్ధతులనవలంబించిరి. దుర్గమారణ్యములనుండి ఆటవికుల ద్వారా ఈ వస్తుజాలమును తెప్పించుటకై అరణ్యములనానుకొనియున్న మన్యప్రాంతపు కొండదొరలను, జమీందారులను లోబరచుకొని వారికి చౌకబారు పేష్కషులిచ్చి మన్యపు గ్రామములకు పట్టాలిచ్చి వారి కుటుంబ వివాదములందు కలిగించుకొనుచు మిత్రభేదము చేయుచు ఆ జమీందారుల బలమును తగ్గించుటకు ప్రయత్నించుచు వారు తమ కిస్తీలను చెల్లించక బాకీలు పెట్టినప్పుడు వారిని జైలులో పెట్టి జమీందారీలనమ్మించుచు తాము చెప్పినట్లు విను ప్రాతజమీందారు వంశీయులగు క్రొత్తవారికి ఆ భూవసతులిచ్చుచు కుటిల రాజ్యతంత్ర ప్రయోగముచే ఆ మన్యపు ప్రాంతములపైన అధికారము వహింపజూచిరి. అవి అనారోగ్య ప్రదేశములైనందున ఆంగ్లేయాధికారులక్కడ నుంచి స్థిరమైన క్రమపరిపాలనమును స్థాపించుటకుగాని పోలీసు సిబ్బందినుంచుటకుగాని ప్రయత్నింపలేదు.

ఇంగ్లీషు కుంపినీవారి దుష్పరిపాలనమునందు జరుగుచుండిన అన్యాయముల వలన మన్యములోని కొండరాజులు జమీందారులు తరచుగా తిరుగుబాటుచేయుచు తమ పరిసరారణ్యములోని ఆటవికజాతుల నాయకుల దగ్గర తలదాచుకొనుచుండిరి. ఆ మన్యప్రాంతములందు కల్లోలములు కలిగినప్పుడు ఆటవికజాతులును తిరుగుబాటు చేయుచుండెను. వారినణచుటకై ఆ ప్రాంతములందు

కుంపినీవారు మార్షల్ లా అను సైనికశాసన ప్రభుత్వమును ప్రవేశపెట్టి సైనికదళములనంపి యుద్ధములు చేయవలసి వచ్చుచుండెను.

ఇంగ్లీషుకుంపినీవారీ దేశమున రాజ్యాధిపత్యము వహించిన కొలదికాలమునందె అనగా 1785 మొదలు 1857లో ఇంగ్లీషువారినిదేశము నుండి తరిమివేయుటకై భారతదేశీయులు స్వాతంత్ర్యయుద్ధముచేసి విఫలులై నిరంకుశమైన బ్రిటీషు ప్రభుత్వ విధానము స్థాపింపబడువరకును గల మధ్యకాలమునందు ఉత్తర సర్కారులలోని మన్యములలో అనగా గోదావరి విశాఖపట్టణము గంజాము ప్రాంతములలోని కొండలు అడవులు గల అనారోగ్యప్రాంతముల యందలి జమీందారులు మోటుజనమగు కోయలు ఖోండులు మొదలగు ఆటవికజనమును, మధ్యరాష్ట్రము బస్తరు మొదలగు ప్రాంతములందలి గోండులును, వింధ్యపర్వతముల నుండి అలహాబాదు వంగరాష్ట్రమువఱకుగల అడవులందలి కోలుజాతివారును, వంగదేశము ఒరిస్సా రాష్ట్రములందలి సంతాలులు, అస్సాము రాష్ట్రమువైపునగల నాగజాతివారు మొదలైనవారును బొంబాయి అరావళీప్రాంతములందు గల భిల్లులును ఆంగ్లేయులతో పోరాడుచునేయుండిరి.

సర్ తామస్ మన్రో, జాన్ రస్సెల్ మొదలైన అనుభవజ్ఞులైన ఆంగ్లేయోద్యోగులీ తిరుగుబాటుల కారణములను విచారించి వానిని అణచివేయుటకు అవలంబింపవలసిన పద్ధతులను గూర్చి 1822-1837 మధ్య కుంపినీ దొరతనమువారికి వివేదికలంపిరి. దీని ఫలితముగా ఆటవికజనము నివసించు మన్యప్రాంతములను కుంపినీవారి రాజ్యములోని ఇతర రాష్ట్రములందు అమలుజరుగు సామాన్య శాసనవిధులకు లోబడిన ప్రభుత్వ విధానమును న్యాయపరిపాలనావిధానమును అమలుజరుపుట మాని గవర్నరులయొక్క ఉత్తర్వులకు లోబడి అవసరములైన చర్యలను తక్షణమే తీసికొనుటకు నిరంకుశాధికారముగల కలెక్టరు అపరిపాలనము స్థాపింపబడెను.

ఈ ఆటవిక జనులపైన కఠిన శాసనవిధానము ప్రయోగింపబడి ఒకవిధమైన సైనిక శాసన ప్రభుత్వము స్థాపింపబడెను. దీనికి నాన్‌రెగ్యులేషన్ ప్రావిన్సులని పేరుపెట్టిరి.

ఆదివాసులు భారతీయులకు భిన్నమైన ప్రజలనియు అమాయకులైన ఆటవికజనమును పరిసరప్రాంతములందలి నాగరికజనము మోసగించి అక్రమలాభము పొందకుండా వారిని రక్షించి వారి క్షేమలాభములనాలోచించి పాలించుటకే ఈ విధానమును తామచ్చట స్థాపించుచున్నామని ఇంగ్లీషువారు చెప్పసాగిరి. ఈ మన్యప్రాంత జనులను తక్కిన ప్రాంతముల జనులనుండి వేరుపరచుటయెగాక మన్యప్రాంతములలోని ఆటవిక జనులలోని వివిధజాతులవారిని కూడా ఒకరినుంచి ఇంకొకరిని వేరుపరచి చీలదీసి పరిపాలింపసాగిరి. వీరిని అనాగరికులుగాను నేరముచేయు జాతులుగాను పరిగణించిరి.

పాశ్చాత్యులీప్రాంతములకు పోయి లాభము పొందుటకుగాని క్రైస్తవులక్కడకుపోయి వారిని కిరస్తానీ మతమున గలుపుటకుగాని ఎట్టి ఆటంకములు లేకుండెను.

భారతదేశములోని వివిధప్రాంతములందు వసించువారందరు భారతదేశీయులైననూ పారతంత్ర్యమునందిట్లనేక విధములైన కష్టములకు లోనైరి. ఇంగ్లీషువారు దేశీయులను వేరుపరచి పాలింపసాగిరి.

ఆంగ్లేయ ప్రభువులు ఆటవికజనమును క్రమక్రమముగా మారుమూలలకు పారదోలి వారికదివరకు హక్కుగల అరణ్యములనాక్రమించి వారికి కాపలా మనుష్యులను పెట్టి అక్కడనెవ్వరును చెట్లు కొట్టకుండా ఆటవిక సంపదకు సంబంధించిన వస్తుజాలమును తీసికొనిపోకుండా తగు కట్టుబాటులు చేసిరి. అరణ్యములను పరిపాలించుటకు 1847లో నొక ప్రత్యేక ప్రభుత్వశాఖనేర్పరచిరి. గవర్నరుజనరలైన డల్‌హౌసీ ప్రభువు దానినిగూర్చి ప్రత్యేక శ్రద్ధవహించి అనేక శాసనములనుగావించి 1855లో బొంబాయి మద్రాసు బర్మాలకు ఆటవిక శాఖాధ్యక్షులను నియమించెను.

ఆంగ్లేయ ప్రభుత్వకాలమునందు వారు చేయు అన్యాయములను సహింపక వారికెదురుతిరిగిన ప్రజాయుద్యమములన్నిటిని 'పితూరీ'లని తిరుగుబాటులని ఆంగ్లచరిత్రకారులనుచుండిరి. అట్లే ఈ అరణ్యముల విషయములో వారు చేసిన అన్యాయములు సహింపక ఆదివాసులు చేసిన యుద్ధములను కూడా వారు పితూరీలనిరి.

ఆంగ్లేయపరిపాలన కాలమునందు భారతదేశములోని వైశాల్యములో రమారమి అయిదవవంతు 26013,9520 యకరముల భూమి అరణ్యముగానున్నది. ఇందులో చాలా భాగము ఇంగ్లీషువారు రిజర్వు ఫారెస్టుగాను కొంతభాగమును సంరక్షిత అరణ్యముగాను మిగిలినదానిని వర్గీకరణము చేయని అడవిగానుంచిరి. ఆంగ్లేయ ప్రభుత్వమునందు 'రెగ్యులేషన్ ప్రావిన్సెస్' అనబడు వివిధరాష్ట్రములందు అమలుజరుగు శాసనబద్ధమైన ప్రభుత్వవిధానముగాక గవర్నరు జారీచేయు ఉత్తరువులకు లోబడి కలెక్టరులు పరిపాలించు నిరంకుశ ప్రభుత్వవిధానము, సైనిక శాసన విధులవంటి కఠిన శాసనముల ప్రకారము పరిపాలింపబడు ప్రాంతములనేకములుండెను. వీనిని నాన్‌రెగ్యులేషన్ ప్రావిన్సులనిరి. తరువాత చేయబడిన భారతదేశ రాజ్యాంగ చట్టములందీప్రాంతములను మినహాయింపబడిన ప్రదేశములనిరి. ఇట్టి ప్రాంతములు భారతదేశములో మొత్తము 207900 చదరపు మైళ్ళ వైశాల్యము కలిగి 1300000 జనసంఖ్య కలిగియుండెనని రాజ్యాంగసంస్కరణలను గూర్చి విచారణచేసిన సైమనుకమీషనువారు 1929లో వ్రాసిరి. అయితే ఈ ప్రాంతములందంతయు నొకేవిధమైన నిరంకుశపరిపాలనము అమలుజరుపబడలేదు. కొన్నికొన్ని ప్రాంతములను పూర్తిగాను మఱికొన్ని ప్రాంతములను కొంతమట్టుకును సామాన్యశాసనబద్ధ ప్రభుత్వమునుండి మినహాయింపబడెను. వానినిట్లు వివరించిరి (Simon Commission Report pp 159-160):

రాజ్యాంగమునుండి పూర్తిగా మినహాయింపు చేయబడిన ప్రాంతములు:

1. మద్రాసులో లక్కదీవులు, మినికోయ్ దీవులు
2. వంగరాష్ట్రమున చిటగాంగు కొండప్రాంతములు
3. పంజాబులో స్పిటి ప్రాంతము
4. బర్మాలోని అన్ని వెనుకబడిన ప్రాంతములు
5. బిహారు ఒరిస్సా రాష్ట్రములలో అంగుళ్ జిల్లా>/li>

గవర్నరు జనరలు గవర్నరుల ఏజెంటుల క్రింద పరిపాలింపబడునవి:

1. మద్రాసులో మన్యపు ఏజెన్సీ ప్రాంతములు

2. బంగాళమున డార్జిలింగు

3. పంజాబులో లాహౌలు ప్రాంతము

4. బీహారు ఒరిస్సాలలో ఛోటానాగపూరు, సంతాలు పరగణాలు. సంబలపూరు

5. అస్సాములోని అన్ని వెనుకబడిన ప్రాంతములు*

ఆటవికజనుల తిరుగుబాటులు II - 1785-1858

1769 నుండి ఇంగ్లీషుకుంపినీవారు ఉత్తర సర్కారు జిల్లాలను పరిపాలించుట ప్రారంభించినది మొదలు కొండలను అడవులను ఆనుకొనియున్న మన్య ప్రదేశములందు పితూరీలు జరుగుచునేయుండెను.

1785లో గూటాల పోలవరము జమీందారీ గ్రామములందును పరిసరములందుగల కొండలలోను తిరుగుబాటులు జరిగెను. ఇంగ్లీషు కుంపినీవారు తమ  సైనికదళమునంపి గూటాల పట్టుకొనుటకు యుద్ధము చేయగా కొందఱు సిపాయిలు మరణించిరి.

1786-87లో పోలవరము గూటాల జమీందారీలలో జరిగిన కల్లోలములను పురస్కరించుకొని కొండజాతి ప్రజలు కూడా తిరుగుబాటుచేసిరి. కొండదొరల నాయకుడైన లింగారెడ్డి మొదలైనవారు యుద్ధముచేసిరి. కుంపినీ సిపాయిలు చాలామంది చచ్చిరి. అంతట పోలవరము జమీందారీలోనూ దాని పరిసరపు జిల్లాలలోను సైనికశాసన ప్రభుత్వము (మార్షల్ లా) ప్రవేశపెట్టిరి. కొత్తసైన్యములనంపి నిలువయుంచిరి.

1800 ఆగస్టు 11వ తేదీన గణపవరములో కుంపినీయధికారులొక యుద్ధాలోచన సభను చేసిరి. తరువాత తమ సేనను చీరువాకకంపిరి. పోలవరమునుండివచ్చు సేనను కొండజమీందారుడైన లింగారెడ్డి మనుష్యులు ప్రతిఘటించిరి. కుంపినీ సైనికాధికారికిని, ఒక సిపాయికిని గాయములు

తగిలెను. యంతట కుంపెని సేనలు లింగారెడ్డి గ్రామములను తగులబెట్టి నాశనముచేసిరి. రంప ప్రాంతములోని ప్రజలను అణచియుంచుటకు కుంపెనీవారు కొత్తపల్లిలోను ఇందిగపేటలోను సిపాయిల దళములనుంచిరి.

1800 ఆగస్టు 28వ తేదీన కొండజాతివారొక దళముపైనపడిరి. 31వ తేదీన పండుదొరయనునతడు మూడునాలుగువందలమంది ఆయుధపాణులతో పోలవరమునకెదురుగానున్న పురుషోత్తమపట్టణమునకు వచ్చు కుంపినీవారి పడవలను పట్టుకొనెను. రాకపోకమార్గములనడ్డెను. ప్రజలు కుంపినీవారికి వ్యతిరేకులుగానుండిరి.

గోదావరి మన్యముల్లోనేగాక ఉత్తర సర్కారులలోని జిల్లాలలోని మన్యప్రదేశములందు నిరంతరముగా తిరుగుబాటులు జరుగుచున్నందున దీనికి కారణములను విచారించుటకు మద్రాసు గవర్నరైన సర్ తామస్ మన్రోగారు 1822లో పర్యటనముచేసిరి.

కిమిడిరాజాగారి జమీందారీలోని చాలా గ్రామములు అడవులలోనుండెను. ఆ గ్రామములలో కొన్నిటిని కిమిడి రాజాగారు కొండలకవతలనుంచి ఆటవికులు మొదలైనవారు వచ్చి కొల్లగొనకుండా కాపాడుటకై కొందరు బంటుమానా జనమునకు చౌకబారు శిస్తులకు ఈనాములుగానిచ్చిరి. 1815లో పిండారీల దండు వచ్చి కొల్లపెట్టుచున్నప్పుడీ బంటుమానా జనమేమియు చేయలేకపోయిరి.

వారింత అసమర్థులుగానుండినను తామివ్వవలసిన శిస్తులను మాత్రము కుంపినీ కలెక్టరుకు చెల్లించక బాకీలుపెట్టిరి. దానిని వసూలు చేయుటకు కలెక్టరు దూరప్రదేశములందునూరోగ్య ప్రాంతములకు తనయుద్యోగులను నౌకరులను పంపవలసి వచ్చుచుండినందువలన దానిని వసూలు చేయలేకపోయెను. దేశీయుల శాంతిభద్రతలును కుంపినీవారు కాపాడలేకపోయిరి. ఆయాప్రాంతములందు కుంపినీవారికి పలుకుబడి లేకుండెను. పరిసర గ్రామములన్ని జమీందారులదేయైనందున వారికి పలుకుబడిలేదు. అందువలన నచ్చటివారిలో కుంపినీవారిపట్ల భక్తివిశ్వాసములు కలవారే లేకుండిరి.

విజయనగరము జమీందారుగారీప్రాంతములో బలవంతుడైయుండుట చూచి ఇంగ్లీషు కుంపినీవారు 1794లో జమీందారు విజయరామరాజుగారు చనిపోగానే ఆయన కుమారునకదివరకు గల అధికారములను తగ్గింపదలచి అదివరకు సీతారామరాజుగారివలన పదచ్యుతులుగా చేయబడిన పూర్వపు కొండ జమీందారులు కొందరికి వారి భూస్థితులు మఱలనొసగిరి. అంతటనీ జమీందారుల కుటుంబములోని మరికొందరు ఆ దేశములో కొంతభాగమునాక్రమించి తామెయధికారులైరి. వీరిని అణచుటకు కుంపినీవారు ప్రయత్నించగా ఒకప్పుడు జయము ఇంకొకప్పుడు పరాజయము కలుగుచుండెను. అందువలన కొందరు జమీందారులకు వీరిపైన గౌరవము తగ్గెను పితూరీలు చెలరేగెను. బందిపోటులు వృద్ధిచెందెను. పేష్కషు బాకీలు పెట్టినవారిపైన కుంపెనీవారు గట్టి చర్య తీసికొనక యుపేక్షించుటవలన కూడా కొంతమంది మూర్ఖమువహించిరి. అంతట 1822 నుండి 1832 వఱకును పితూరీలు క్రమక్రమముగా వృద్ధియయ్యెను. అప్పుడీ పితూరీల కారణములును చూపించి వానిని అణచి క్రొత్తవి పుట్టకుండా తీవ్రమైన చర్య తీసికొనుటకు 1832లో జార్జి రస్సెల్ దొరగారిని స్పెషల్ కమీషనరుగా నియమించి ఆయనకు సర్వాధికారములనిచ్చిపంపిరి (గోదావరి జిల్లా డిస్ట్రిక్ట్ మాన్యూలు Godavari District Manual: Henry Morris. pp. 88-91).




విశాఖపట్టణము జిల్లాలో 1831-32 మధ్య పాలకొండలోను, ఇతరప్రాంతములందు పితూరీలు జరిగెను. పితూరీదారులు కుంపెనీవారి సిపాయిలను చంపి గాయపరచిరి, తుపాకులెత్తుకొనిపోయిరి.

1833లో రస్సెలుగారు వచ్చిన తరువాత కూడా చాలా దౌర్జన్యములు జరిగెను. అంతట రస్సెలుగారా ప్రాంతమునందు సైనిక శాసనములను ప్రవేశపెట్టి పితూరీదారుల నాయకులను పట్టుకొని మిలిటరీ కోర్టులో విచారించి కొందరినురిదీసిరి. జిల్లా పరిస్థితులను గూర్చి రస్సెల్‌గారు 1834లోను 1836-37లోను నివేదికలంపిరి. గవర్నరైన ఆదముగారు 1835లో వచ్చి చూచిరి (విశాఖపట్టణము జిల్లా మాన్యూలు కార్మైకేలు (1868) pp 268-275, 418-423).

ఖాండేషులోను బొంబాయి రాష్ట్రములోను గల భిల్లులు 1825లో నింగ్లీషు కుంపినీ ప్రభుత్వమువారిపైన తిరుగుబాటు గావించిరి. ఇంగ్లీషువారీ భిల్లులపైన 23వ రెజిమెంటు అనబడు సైనికదళమునంపుటయె గాక నిజాముగారి ఖర్చుపైన హైదరాబాదులో నుంచబడిన ఇంగ్లీషు సైన్యమును కూడా వారికి సహాయముగాపంపిరి. అప్పుడీభిల్లులతో తీవ్రమైన యుద్ధములు జరిగెను. తరువాత ఖాండేషులోనొక భిల్లుల ఏజెన్సీప్రాంతమును స్థాపించిరి. తరువాత 1857లో ప్రఖ్యాతివహించిన జనరల్ ఔట్రాము అప్పటికిరువదిరెండు సంవత్సరములు నిండని యువకుడు. అతనిని ఖాండేషులో కమిషనరుగా నియమించిరి. అతని ధైర్యసాహసములు ఔదార్యమును వేటలో ఆసక్తియు భిల్లులనాకర్షించెను. ఆయనపైన వారికి గౌరవము కలిగెను. అంతట ఆయన కృషివలననే భిల్లులు క్రమక్రమముగా ఇంగ్లీషు ప్రభుభక్తులై సైనికదళమున చేరిరి. 1840-45 మధ్యనొక పెద్ద సైనికదళమును నిర్మించిరి. వీరు 1857లో ఇంగ్లీషువారికి సహాయముచేసిరి.

కోల్ జాతివారు 1832లో ఇంగ్లీషు కుంపినీవారిపైన తిరుగుబాటుగావించిరి. వీరు చాలా తీవ్రంగా పోరాడిరి. ఇంగ్లీషుకుంపినీవారు తమ సిపాయిలను తెల్లసైనికులనంపి తుపాకులను ప్రయోగించి చాలామందిని వధించిరి. వారు చాలా మందుగుండు సామాను సొమ్ము ఖర్చుపెట్టవలసివచ్చెను. ఇంగ్లీషువారి గుండ్లవర్షము ముందు కోల్ జాతివారి బల్లెములు విల్లునంబులు పనిచేయలేకపోయి కోల్ జాతివారి గ్రామాలను ఇంగ్లీషు సైనికులు తగులబెట్టిరి. తుదకెంతో కష్టముపైననే కోల్ జాతివారు యుద్ధమును చేయుట విరమించిరి. ఈ తిరుగుబాటునకింగ్లీషువారెన్నో కారణములను చెప్పిరికాని నిజమైన కారణములను ప్రకటింపరైరి. ప్రభుత్వోద్యోగులు చేసిన అన్యాయమును ప్రజాపీడనమును దోపిడియు నీతిరుగుబాటునకు కారణములనియు ఈ యుద్యోగులు లంచములు పుచ్చుకొని తమ

అధికారమును దుర్వినియోగము చేయుచుండిరనియు అక్రమములు చేయు వ్యక్తులకు వీరు తోడ్పడుచుండిరనియు ఆ కాలమున జిల్లా జడ్జిగానుండిన ఫ్రెడరిక్ జాన్ షోర్‌గారు వ్రాసియున్నారు (Notes on Indian Affairs, Frederick John Shore. 1838. Vol.I, pp 145-166). ఇంగ్లీషు ప్రభుత్వకాలమునందు సంతాలు పరగణాయను ప్రాంతమున జీవించు సంతాలులను బంగాళీ బిహారీ భూస్వాములు పీడింపసాగిరి. వీరు ఇంగ్లీషు కుంపినీవారి వశవర్తులుగానుండి రుచిమరగి సంతాలులపట్ల అన్యాయములుచేసి బాధించుటవలన సంతాలులకు తీవ్రమైన అసంతృప్తి కలిగి 1835లో తిరుగుబాటు గావించిరి. ఇంగ్లీషుకుంపినీవారు స్థాపించిన న్యాయస్థానములలో తమకు న్యాయము కలుగునను ఆశ వారికి లేనందున వారు తమ బాధలనుగూర్చి అక్కడ ఫిర్యాదుచేయక తమ స్వశక్తి వలన వానిని నివారణ చేసికొనదలచిరి. వారు కనబడిన బంగాళీలనెల్ల హింసించి బాధించి చంపుట ప్రారంభించిరి. అపుడు కుంపినీవారు తమ రిగ్యులర్ సైన్యమునంపి వారిపైన తుపాకులు కాల్పించిరి. సంతాలు తిరుగుబాటును అణచి వారు వసించు ప్రాంతమును ప్రత్యేక పరగణాగా చేసిరి. దానితో నాన్ రెగ్యులేషన్ ప్రావిన్సులలో నిరంకుశ పరిపాలనము స్థాపించిరి. సంతాలుల బాధలు మితిమీరెను.

ఇంగ్లీషువారు తమకన్యాయము చేయుచున్నారని సంతాలులు తలచి కలకత్తాకు పోయి తమ బాధలు చెప్పుకొనదలచి 1855లో గుంపులుగా బయలుదేరిరి. వారికి ఆవేశము కలిగి దారిలోని గ్రామములను తగులబెట్టసాగిరి. అంతట కుంపినీవారు తమ సైన్యముచే తుపాకులు కాల్పించిరి. తరువాతయొక శిక్షార్హపు పోలీసుదళమును సమకూర్చి ఒక పెద్ద దళముతో సంతాలులనణచియుంచిరి. ఈ తిరుగుబాటు జరిగిన తరువాతనీ సంతాలు పరగణాలలో సామాన్య పరిపాలనమును పూర్తిగా రద్దుచేసి సైనిక శాసన పరిపాలనము వంటి ప్రభుత్వము నమలుజరిపిరి. వీరి నేరములను విచారించుటకు ప్రత్యేక న్యాయస్థానముల నేర్పరచిరి. భూమి హక్కుల నిర్ణయము పరిష్కారములను చేయుటకు ప్రత్యేక శాసనవిధులను గావించిరి. ఇంగ్లీషువారీ ప్రాంతములోనికి బంగాళీలు రాకుండా అనేక నిషేధములను గావించిరి. ఏమిచేసినను వారేదోవిధముగా ప్రవేశించి

సంతాలులను పీడించుచునేయున్నారని ఆంగ్లేయులు చెప్పిరి. అయితే ఇంగ్లీషు వర్తకులును మిషనరీలును గావించు అన్యాయములను గూర్చి చెప్పరైరి.

జయపురము జమీందారుగారైన విక్రమదేవుగారు అసమర్థులుగా నుండినందున ఆయనక్రింది వ్యవహారస్తులు చాలా అక్రమములు చేయుచు ప్రజలను పీడింపసాగిరి. 1848లో రైతులు విశాఖపట్టణమునకు వచ్చి దేశములో నరహత్యలు దొంగతనములు బలవదాక్రమణలు జరుగుచున్నవని ఫిర్యాదుచేసిరి. రాజుగారి యుద్యోగులును జయపురం తాలూకా నుండి తరిమివేయుటతో పితూరీలు పుట్టెను. 1855-56 సంవత్సరములలో కూడా జయపురము జమీందారీలో పితూరీలు పుట్టెను.

1857లో ఉత్తర హిందుస్థానమునుండి మహారాష్ట్ర గోసాయిలును గోసాయి వేషధారులును మహమ్మదీయ వాహబీ ఫకీరులును దక్షిణదేశమునకు వచ్చి మొగలాయి చక్రవర్తి, నానాసాహెబు మొదలైన దేశనాయకులేకమై మనదేశమునాక్రమించిన విజాతీయులైన ఇంగ్లీషువారిని తరిమివేయుటకు యుద్ధము చేయుచున్నారను సంగతిని ప్రజలకు చెప్పి ఇక్కడివారిని కూడా తిరుగుబాటుచేయుడని ప్రోత్సహించుచుండిరి. అయినను హిందువులకీ మహారాష్ట్రుల మాటలుగాని ఫకీరులమాటలుగాని రుచించలేదు.

అంతకుపూర్వము కొంతకాలముక్రిందట మరాఠీ పిండారీ దండులవలన బాధలను మహమ్మదీయుల నిరంకుశాధికారులు పెట్టిన బాధలును వీరనుభవించియుండిరి. మహమ్మదీయులలో మాత్రము కొంచం సంచలనము కలిగెను. ఆ సంవత్సరం మొహరము పండుగలో కొంత అల్లరి జరుగవచ్చునని గోదావరి జిల్లా కలెక్టరు మొదలైనవారు అనుమానించిరి. ఆ సంవత్సరము మొహరము పండుగ ఆగస్టు నెలలో వచ్చెను. అప్పటికి ఇంగ్లీషువారి పరిస్థితు లుత్తరహిందుస్థానమున బాగాలేవు. అయితే అల్లరులు జరుగలేదు.

గోదావరి జిల్లాలో అప్పటి యెర్నగూడెము తాటిమళ్ళ తాలూకాలకుత్తరమున కొండల ప్రాంతములోని మన్యమునందు మాత్రము యొక చిన్న తిరుగుబాటు జరిగెను.

కొరటూరు గ్రామ మునసబు కోరుకొండ సుబ్బారెడ్డిగారి కుమారుడొక ధనవంతురాలైన వితంతువును వివాహమాడదలచెను. అయితే ఆమెను బుట్టాయిగూడెము గ్రామమునసబు దగ్గరకు తీసియుండెను. అంతట సుబ్బారెడ్డిగారి తాలూకు కోయజాతి పరిజనులు ఆ స్త్రీని బలవంతముగానెత్తుకొని పోవుటకు ప్రయత్నించిరి. ఆమె దొరకనందువలన వారికాగ్రహము కలిగి ఆమె భర్త గ్రామమును కొల్లుపెట్టిరి.

అప్పుడు హెడ్ అసిస్టెంటు మేజిస్ట్రేటు 60 మంది లేక 70 మంది పోలీసు జవానులును బయలుదేరి అల్లరి జరిగినచోటికి వెళ్ళి దోపిడీ ఆస్తితో కొందరు నేరస్తులను పట్టుకొని బుట్టాయిగూడెమునకు తిరిగివచ్చెను. అప్పుడక్కడ సుబ్బారెడ్డిగారి క్రిందికొండజాతివారు విల్లు అమ్ములతోను తుపాకులతోను ఆయుధపాణులై వచ్చి వీరిని ముట్టడించిరి. అప్పుడామేజిస్ట్రేటు చేయునదిలేక ఖైదీలను వదలిపెట్టెను.

అటుతరువాత గోదావరి జిల్లా కలెక్టరు ధవళేశ్వరములోనున్న కెప్తాను రోజ్ క్రింద రెండు కంపినీల శాపర్సు అండ్ మైనర్సు అను సైనికదళములతో బయలుదేరి తిరుగుబాటుదారులు నాగవరములో దాగికొన్నట్లు తెలిసి అక్కడికి వెళ్ళగా వారు రహస్యమార్గముల ద్వారా పారిపోయిరి. అంతట సిపాయిలు వారిని తరుముకొనిపోవుచు జీలుగుమిల్లి దగ్గరనొక కొండనెక్కుచుండగా తిరుగుబాటుదారులా కొండపైనుండి క్రిందకు తుపాకులను కాల్చుట ప్రారంభించిరి. కొండ రెండుప్రక్కలను అడవులుండెను. సిపాయిలు చుట్టు దిరిగి గ్రామములోనికి వెళ్ళగా తిరుగుబాటుదారులు వీరిపైన బాణములవర్షము కురిపించి తుపాకులతో కాల్చి అడవులలోనికి పారిపోయిరి. సిపాయిలు వారికొరకు వెదకినను దొరకలేదు. అపుడా సిపాయిలు చుట్టుపట్ల గ్రామములను తగులబెట్టుట ప్రారంభించిరి. గ్రామస్థులు భయపడి ఇండ్లను ఖాళీచేసి వెళ్ళిపోవసాగిరి. ఇట్లు పదునైదు దినములా మన్యములో నీసిపాయిలు చాలా అవస్థలుపడుచు తిరిగిరి. ఇంతలో వారికి మన్యపు జ్వరములు పట్టుకొనెను. కొందరు చచ్చిరి. తరువాత దీనినిమిత్తమొక రివిన్యూ సిబ్బందిని తయారుచేసి కెప్తాను అల్లెయిన్ బ్లూమ్‌ఫీల్డ్ క్రింద పంపించిరి. అప్పుడు సుబ్బారెడ్డిని పలువురు కుట్రదారులను పట్టుకొని స్పెషల్ కమిషనరుగా పనిచేయుచున్న జడ్జిగారి ఎదుట పెట్టి 1857వ

సంవత్సరపు XIVవ నెంబరు చట్టము క్రింద విచారించి సుబ్బారెడ్డికిని కొర్ల సీతారామయ్యకును మరణశిక్ష విధించి 1858 అక్టోబరు 7వ తేదీన బుట్టాయిగూడెము గ్రామములో నురిదీసిరి.

సీతారామయ్య సవతి తమ్ముడు కొర్ల వెంకటసుబ్బారెడ్డిని గురుగుంట్ల కొమ్మిరెడ్డిని ఆదినముననే సుంకరస్వామిని హత్యచేసిన నేరమునకు మద్దతుచేసిరని పోలవరములో నురిదీసిరి. అప్పుడే కోరుకొండ సుబ్బారెడ్డి సోదరుడైన తమ్మిరెడ్డి తిరుగుబాటులో పాల్గొనినందుకు తూటిగుంటలో నురిదీసిరి. ఈ విచారణలో నొక ప్రధాన ముద్దాయి రెండుచేతులు జోడించి నానాసాహెబు జయముపొంది తన సైన్యములతో వచ్చుచున్నాడనియు ఇంగ్లీషువారికి వ్యతిరేకముగా పనిచేయువారందరికి తగుబహుమతులిచ్చుననియు తాను వింటిననియు అందువలన తానీ తిరుగుబాటులో పాల్గొంటిననియు చెప్పెను (Godavari District Manual Henry Morris (1878) pp 299-301).

యర్నగూడెము తాలూకా పూర్వము రాజమహేంద్రవరం గోదావరి జిల్లాయందు చేరియుండెను. దానికి ఉత్తరమున నిజాము రాజ్యమును దక్షిణమున తణుకు తూర్పున గోదావరి నది పడమర ఏలూరు తాలూకాయుండెను. దీని విస్తీర్ణము 1249 చదరపు మైళ్ళు. 1866లో జనసంఖ్య 145715. ఇందులో 203 గ్రామములున్నవి. 92 జమీందారీలవి. దీని క్రింద కొండముతా గ్రామములునుండెను. యర్నగూడెము జడ్డంగి కొండ మన్యములు. నాగరీక ప్రజల తాలూకాలకు దగ్గరగానున్నందువలన తక్కిన మన్యప్రాంతములకన్నా కొంత తెలుగుమీరిన ప్రదేశములగానుండెను. ఇవి 385 చదరపు మైళ్ళ వైశాల్యముండెను. ఇందులో కోయవారుండిరి. కొన్ని భూములు మున్సబుదారులక్రింద కౌళ్ళకిచ్చుచుండిరి. ఇక్కడి అబ్కారీ నల్లమందు వ్యవహారములు తక్కిన గ్రామములకు భిన్నముగానుండెను. అప్పటి శాసనవిధులును వ్యత్యాసముగనేయుండెను. కలెక్టరులె గవర్నరు ఏజెంటుగా నిరంకుశపరిపాలనము జరుపుచుండెను.

ఈ యర్నగూడెము కొండల మన్యములో 1858లో నొక తిరుగుబాటు ప్రారంభమయ్యెను. చాలాచోట్ల కొండజాతివారు ఇతర ప్రజలు తిరుగబడిరి. ఇది 1862 వఱకును జరుగుచునేయుండెను. పితూరీదారులను పట్టుకొని ఉరిదీసిరి. ముఠాదారుల ముఠాలను ఇంగ్లీషు ప్రభుత్వమువారు రద్దుచేసి

తీసుకొన్న గ్రామములను దగ్గరనున్న రెండు సర్కారు గ్రామ మునసబులక్రిందనుంచిరి. ఈ ప్రాంతములో కొంతభాగము పోలవరము గూటాల జమీందారీలో చేరియుండెను (Maclean's Manual Vol. I pp 75).

(సశేషం)

భారత స్వాతంత్ర్య సమరములు: 1757-1857

రచన: దిగవల్లి వేంకట శివరావు

అక్టోబర్ 2020

(ఈ వ్యాసపు మొదటిభాగంఇక్కడ; రెండవభాగం ఇక్కడ; మూడవభాగం ఇక్కడ చదవండి.)

వాహబీల జిహాద్ యుద్ధములు

వాహబీలనువారు ఇస్లాము మతములోని నైష్ఠికులు. వీరు మహమ్మదు ప్రవక్త విధించిన మహమ్మదీయ మతధర్మములను యథావిధిగానాచరించవలెనను పట్టుదల కలిగి అభివృద్ధి పద్ధతులనుగాని మార్పులను గాని సహింపక మతావేశపరులుగానుందురు. ఇందులకు భిన్నముగా ప్రవర్తించువారందరిని 'కాఫిరు'లుగా పరిగణింతురు. మహమ్మదుగారి నిజమైన మతధర్మములకు విరోధులైనవారందఱు తమశత్రువులుగానెంచుదురు. వారు తలపెట్టిన కార్యములెల్ల మతధర్మములను సంరక్షించుటకు చేయు 'జిహాద్' అను ధర్మయుద్ధములుగానెంచి ఆ కృషియందు ప్రాణములనుబాసినచో స్వర్గము లభించునని ఎంచుదురు. అందువలన వారేయుద్యమమునారంభించినను దానినావేశముతో ప్రచారం చేయుదురు.



మహమ్మదీయులందరును సోదరులవలే నుండవలెననియు అందులో నొక తెగకు నింకొక తెగకు వైరములుండరాదనియు వీరియభిప్రాయము. అందువలన భారతదేశ పశ్చిమోత్తర సరిహద్దులో నున్న వివిధ పఠానులను తెగలవారొండొరులపైన పగసాధించుటకై చేయు దండయాత్రలను నరవధలను వీరు సహింపక అందఱినేకము చేయుటకు ప్రయత్నించిరి. వాహబీలు ఖురానులోని విధినిషేధములు తప్ప సాధారణముగా మహమ్మదీయులవలంబించు ఇతర ఆచారములను అంగీకరింపరు.

వాహబీశాఖ పశ్చిమోత్తర పరగణాలలోని స్వాటు సిత్తాన ప్రాంతములందు మొదట అభివృద్ధి చెంది అక్కడి సరిహద్దులోనుండు పఠాను జాతులతో సంబంధము కలిగియుండెను. వాహబీలు మొదట సిత్తాన పట్టణములోను మల్కా (మల్క) జిల్లాలోని ఒక కొండప్రాంతమునను స్థిరనివాసమేర్పరచుకొనిరి. ఇది సింధు నదికిని కాబూలు నదికిని సరిహద్దులోనుండెను. స్వాట్ తెగవారును ఆఫ్గనులును వాహబీశాఖ యభివృద్ధికి తోడ్పడిరి. తరువాత వీరు ఉత్తర భారతదేశములో వ్యాపించి పట్నా నగరమును తమకు ముఖ్యకార్యస్థానముగా చేసికొనిరి. అటుపిమ్మట వీరు దేశములోని అన్నిప్రాంతములకును తమ ఫకీరులను పంపి ప్రతిగ్రామమునందును ప్రచారమునారంభించిరి.

వాహబీ ఫకీరులు ప్రతి గ్రామమున పట్టణమున ఇస్లాము మత ప్రాశస్త్యమును బోధించుచు అందుకు భిన్నముగా ప్రవర్తించువారిపైన మతయుద్ధము చేయవలయునను తీవ్రప్రచారము చేయసాగిరి.

ఆంగ్లేయులు మహమ్మదీయులకు హేయమైన పందిమాంసమును తిని అనాచారముగా నుండు పరంగీల జాతికి చెందిన కాఫిరులనియు వారీ దేశములోని మహమ్మదీయులకు ప్రభువులై ఏలుట అన్యాయమనియు వీరిని దేశమునుండి వెళ్ళగొట్టవలెననియు వీరు ప్రచారము చేయుచుండిరి.

మద్రాసులోని సిపాయిలందరు దొరటోపీలవంటి శిరస్త్రాణములను ధరించవలెననియు హిందూసిపాయిలు బొట్టు చెవులపోగులు తీసివేసి గడ్డములు గొరిగించుకొనవలెననియు 1806లో కొత్త సైనిక నిబంధనలను చేసినప్పుడు ఇంగ్లీషువారు సిపాయిలకు దొర టోపీలు పెట్టించి వారికి పరంగీల వేషము వేసి మతభ్రష్టులను చేయదలచిరనియు తరువాత కిరస్తానీ మతముల కలుపుకొందురనియు నీకాఫిరులైన ఇంగ్లీషువాని ప్రభుత్వమునకు వినాశకాలమాసన్నమైనదనియు నిదిత్వరలోనే కూలిపోవుననియు రాయివేలూరులోనొక వాహబీఫకీరు ప్రచారము చేయసాగెను.

మైసూరునేలిన టిప్పుసుల్తాను మహమ్మదీయ మతావేశపరుడైయుండెను. ఆంగ్లేయులు ఆయనపైన యుద్ధముచేసి రాజ్యమును వశముచేసికొని టిప్పుసుల్తానును వాని 19మంది కొమాళ్ళను వారి కుటుంబములను రాయవేలూరు కోటలో ఖైదుచేసిరి. వారికి కావలిగా 1500 మంది సిపాయిలను కొన్ని వందలమంది ఇంగ్లీషు సైనికులను అక్కడనుంచిరి. ఈ రాజకుటుంబమువారి పరిజనమునతో వాహబీ ఫకీరులు సంబంధముకలిగి సిపాయిలలో అసంతృప్తి వ్యాపింపజేసిరని అందువలననే 1806లో దేశీయ సిపాయిలు తిరగబడి కొందరు ఇంగ్లీషు సైనికోద్యోగులను సైనికులను తుపాకులతో కాల్చిచంపిరని ఆ కాలమున అందఱు అనుకొనిరి. ఏదియెట్లున్నను వాహబీఫకీరు రాయవేలూరులో మతప్రచారము పేరున ఇంగ్లీషువారికి వ్యతిరేకముగా కుట్రలు చేయుచుండిన మాట నిజము. ఈ ఫకీరులెక్కడున్నను కాఫిరులైన ఆంగ్లేయులపైన కత్తికట్టవలెనని ప్రచారము చేయుచుందురు.

1824

అస్సామురాష్ట్రమాకాలమున బర్మావారిక్రిందనుండెను. నాఫ్‌నదిలోని ఒక లంక తమదని బర్మా గవర్నరు దానినాక్రమింపజూచెను. ఇంగ్లీషువారు 1824 ఫిబ్రవరి 24వ తేదీన బర్మాపైన దండయాత్ర చేయుటకు బయలుదేరిరి. వంగదేశమునుండి బర్మాకు పోవు మార్గము ఘోరారణ్యములలోను

నదులతోను నిండియుండెను. ఒక ఇంగ్లీషు సైనికదళమును బర్మావారు మే 15వ తేదీన ఓడించిరి. తరువాత ఇంగ్లీషువారు బర్మాలో కొంత జయమును పొంది తుదకు సంధి జరిగినను ఈ అపజయపు వార్త భారతదేశములో అగ్నివలే వ్యాపించెను. దేశములో ఇంగ్లీషువారి ప్రభుత్వము పట్ల అసంతృప్తిగలవారికి వాహబీల తీవ్రప్రచారము తోడయ్యెను. అంతట 1824లో ఉత్తర హిందుస్థానములోని ఎగువ ప్రాంతములందలి అన్ని పరగణాలలోను అన్ని జిల్లాలలోను కల్లోలములు తిరుగుబాటులు చెలరేగెను. దీనినిగూర్చి ఆ కాలమున జడ్జిగానుండిన ఫ్రెడరిక్ జాన్‌షోర్‌గారు 1833లో వ్రాసిరి (చూడు: 1824 నాటి తిరుగుబాటు అను ప్రకరణము) ఆ సమయమున దేశములోని గొప్ప హిందూ మహమ్మదీయ రాజవంశీయులైన ప్రభువులు జాగీరుదార్లు మొదలైనవారందరును ఇంగ్లీషువారికి వ్యతిరేకులైరి. ఇంగ్లీషురాజ్యమంతరించినది 'ఆంగ్రీజ్ ముర్దాబాద్' ఇంగ్లీషువారు నశింతురుగాక అను కేకలతో ఆయుధపాణులైన అల్లరి జనము వందలకొలది తిరుగుబాటు చేసిరి.

1838

కాఫిరులైన ఆంగ్లేయులు హిందూదేశములోని మహమ్మదీయసామ్రాజ్యమును నాశనము చేసి తాము ప్రభువులగుటయెగాక ప్రక్కనున్న ఆఫ్గన్ రాజ్యమునందలి వ్యవహారములలో కలుగజేసుకొని దోస్తు మహమ్మదుకు బదులుగా షా షుజాను సింహాసనమెక్కించుటకు కుట్రచేసిరి. దీనినిగూర్చి వారు 1838 అక్టోబరు 1వ తేదీన సిమ్లాలోనొక ప్రకటనకూడా చేసిరి. ఆఫ్గనిస్థానముననింగ్లీషువారు చేసిన యుద్ధములందు దేశీయ సైనికులు చాలమంది ప్రాణములనుబాసిరి. కాఫిరులైన ఆంగ్లేయుల యొక్క సహాయమును షా షుజా పొందినందులకు వాహబీలాశ్చర్యపడిరి. ఆఫ్గనిస్థానములోని యుద్ధము తీవ్రముగానుండెను. ఆ సమయమున వాహబీలు భారతదేశములో నింగ్లీషువారిని దేశమునుండి వెళ్ళగొట్టవలెనని గొప్ప కుట్రను సాగించుచుండిరి.

వాహబీలు తమ పకీరులను దక్షిణహిందూదేశమున హైదరాబాదుకును కర్నూలుకును మద్రాసుకు దక్షిణమునగల దూరప్రాంతములకు కూడా పంపి ఇంగ్లీషువారిపైన జిహాద్ మతయుద్ధముచేయుటకై కుట్రలు చేసిరి. ఆ యుద్ధముకొరకు సర్వసన్నాహములును జరిగెను. కర్నూలు నవాబైన గులాం

రసూలుఖాను వాహబీల కుట్రకులోనై తన కోటలో నేలకొట్లు నిర్మించి అందులోనొక గొప్ప ఆయుధాగారమునుంచి ఫిరంగుల బండ్లు గొట్టములు గుండ్లు తయారుచేయించెను. హైదరాబాదు నిజాముగారి సోదరుడైన ముబారిజ్ ఉద్దౌలా తన ఆంతరంగికులతో హైదరాబాదులో నీకుట్రకు నాయకుడయ్యెను. హైదరాబాదులోని ఇంగ్లీషు సైన్యములోని సిపాయిలను తిరుగుబాటు చేయుటకై వారిలో కొందరి మనస్సులు విరిచిరి. అప్పుడు చిత్రవిచిత్రములైన రహస్యపద్ధతులలతో రహస్యప్రచారము జరుగుచుండెను. 1839లో నాకస్మికముగా నీకుట్రలసంగతి బయటపడెను. అంతట ఇంగ్లీషువారు విచారించగా నిదిచాలాతీవ్రముగా వ్రేళ్ళుపారినట్లు తెలిసెను. ముబారిజ్ ఉద్దౌలా టోంకు నవాబులోను రాంపూరు ఉదయగిరి అయోధ్య నవాబులలోను ఉత్తరప్రత్యుత్తరములు జరిపినట్లు బయల్పడెను. అంతట ముచారిజ్ ఉద్దౌలాను ఆయన అనుచరులను 40మందిని పట్టుకొని ఆయనను గోలకొండ కోటలో ఖైదుచేసిరి. అతడక్కడనే 1854లో మరణించెను. గులాం రసూలుఖాను కోటను శోధించగా రహస్య ఆయుధాగారము బయల్పడెను. అంతటనతనిని పదచ్యుతునిగాచేసి తిరుచునాపల్లిలో ఖైదుచేసిరి. అక్కడనతడింగ్లీషువారిని మెప్పించుటకై చర్చికివెళ్ళుట ప్రారంభించగా నొకవాహబీ ఫకీరతనిని వధించెను. ఈ సంగతులను గూర్చి 'కందనూరు నవాబు రాజరికము' అను శీర్షిక క్రింద *కథలు గాథలు* అను గ్రంథమునందు నేను వ్రాసియున్నాను.

సాత్త్విక నిరోధ ప్రకరణము

ధరణా కూర్చుని సాత్త్విక నిరోధము చేయుట భారతదేశములో అనాదిసిద్ధమైన సత్యాగ్రహ పద్ధతి. ఒకడింకొకనికన్యాయము చేసినయెడల అన్యాయమును పొందినవాడాయన్యాయము చేసినవాని వాకిట తిండి తినక, ఎండయనక వానయనక నిశ్చలముగా కూర్చుండి యుండును. దీనికే ధరణాకూర్చొనుటయందురు. ఇట్లు కూర్చుండి ప్రాయోపవేశము చేసి ప్రాణములను బాసినవాని యుసురాయింటివానికి గొట్టుననియు, చనిపోయినవాడు దయ్యమై పీకికొని తినుననియు ప్రజలనమ్మకము. ఇట్లొకడుపవాసములో పడియుండగా నింటివారు భుజించుట గాని, తమ యింటిపనులు చక్కబెట్టుకొనుటగాని శ్రేయస్కరము కాదనియు జనుల నమ్మకము. అందువలన ఎవనికే బాధ కలిగినను వాడు తన్ను బాధించువానిని కొట్టక తిట్టక, వాని వాకిటనిట్లు ధరణా

కూర్చొని వానిని సాధించుచుండును. ఋణబాధపడు ఋణగ్రస్తుడు ఋణదాత యింటి గుమ్మములో ప్రాయోపవేశము చేయుటయు, పెంకెవాడగు ఋణదాత ఋణగ్రస్తుని వాకిట ధరణా పండుకొనటయు సామాన్యముగ జరుగుచుండెను. చీటికి మాటికి నిట్లు ప్రజలు ధరణాకూర్చొని ప్రాయోపవేశము చేసి యొండొరులను పీడించుకొనుటయు దీనిని రాజకీయములందు ప్రయోగించి ప్రభుత్వమువారికిగూడ నేమి చేయుటకు తోచకుండునట్లు చేయుటయు జూచి, బ్రిటిష్ ప్రభుత్వమువారు శిక్షాస్మృతిలో దీనినొక నేరముగా జేసిరి. (Sec. 508 I.P.C.)

రాజకీయాలలో సాత్విక నిరోధం

"ఈ భారతదేశ ప్రజలకును వీరిని పరిపాలించు ప్రభువులకును మధ్య మొదటి నుండియు దాటశక్యము గాని అగాధమైన అంతరముండెను. ఈ ఆంగ్లేయ ప్రభుత్వమునకు పూర్వమీ ప్రజలనేలిన మొగలాయి ప్రభువులును దేశీయ రాజులునుగూడ నిరంకుశులుగ నుండిరి. వీరు ప్రజలకు బాధ్యతవహించి పరిపాలించువారు కానందున, ప్రజల విశ్వాసమునకు పాత్రులుగాలేదు. ప్రభుత్వోద్దేశ్యములను ప్రజలు గ్రహింపలేకుండిరి. ప్రజల కోర్కెలను మన్నించునట్లు చేయుటకుగాని ప్రజల యభిమతానుసారముగా పరిపాలన జరుగునట్లు చేయుటకుగాని ప్రజలకెట్టి యధికారములు గాని పలుకుబడిగాని లేకపోవుటవలన, ప్రభుత్వమువారి చర్యలు ప్రజల కిష్టములేనప్పుడు ప్రజలాయుధములు పూని తిరుగుబాటు చేయుటయో, లేదా అందరు నేకమై కట్టుగట్టి సాత్విక నిరోధము చేయుటయో తప్ప ప్రభుత్వమువారి నిర్ణయములను మార్చుటకు వేరు మార్గములు లేకుండెను. ఈ సాత్విక నిరోధ విధానము ఈ దేశప్రజలలో అనాది సిద్ధమైన ఆయుధముగానున్నది. ఆంగ్లేయులీ దేశమునకు ప్రభువులైన పిమ్మటగూడ ప్రజల యభిమతానుసారముగ పరిపాలించు పద్ధతి నవలంబింపలేదు. పైగా నీ విదేశీయ పాలకులకు పాలితులకును రంగులోను భాషలోను మతములోను ఇది యది యననేల ఒక మానవున కింకొకనికి పరస్పరముగనుండు అన్ని సంబంధములందునుగూడ విపరీతమైన తారతమ్యమున్నందువలన, సహజమైన సానుభూతి మృగ్యమైపోయినది. కేవలము ఆంగ్లేయుల బలమును జూచి భయపడియె లొంగియున్నారు. పూర్వపు ప్రభుత్వములపైన నున్నంతపాటి పలుకుబడియైనను ప్రజలకు కుంపిణీ పరిపాలనమున

లేకుండెను. ఈ సందర్భమున సాత్త్విక నిరోధమే వారికి శరణ్యమైనది. కుంపిణీవారి పాలనమున భారతీయ ప్రజలు సాత్త్విక నిరోధము చేసిన యుదాహరణములనేకములు గలవు."

అని చెన్న పట్టణ గవర్నరుగనుండిన సర్ ఛార్లెస్ ట్రెవిలియన్‌గారు 1859లో వ్రాసియున్నారు. సిపాయీల విప్లవానంతరము భారత దేశమును పాలించు ఆంగ్లేయ గవర్నరు జనరల్ కార్యాలోచన సభలో ఫైనాన్సు ద్రవ్య వ్యవహారముల సభ్యుడగు జేమ్సు విల్సన్‌గారు భారతదేశ ప్రజలపైన క్రొత్త పన్నులు విధించుటకొక ప్రణాళికను జారీచేసిరి. దానివలన ఉప్పు పన్ను హెచ్చించుటయే గాక క్రొత్తగా ఆదాయములపైన పన్ను పొగాకుపైన పన్ను వృత్తులు వ్యాపారములకు లైసెన్సుపన్ను విధింపదలచెను. ఆంగ్ల పరిపాలనలో ప్రజలు పొందు లాభములు లేకపోగా పన్నులిచ్చుకోలేక బాధలుపడుచున్నారనియు ప్రభుత్వమువారి సైనిక వ్యయము ద్రవ్యపద్ధతి లోపభూయిష్ఠముగా నున్నదనియు ఈ కొత్త పన్నులు విధించుట యన్యాయమనియు చెప్పుచు ఆనాడు చెన్నపట్టణమున గవర్నరుగానుండిన సర్ ఛార్లెస్ ట్రెవిలియన్‌గారు దీనికి తన అసమ్మతిని సూచించుచు 10-6-1859 తేదీనను, దరిమిలానుగూడ మినిట్సు వ్రాసి గవర్నరు జనరలుకంపిరి. కేంద్ర ప్రభుత్వమువారి కోరికపైన భారతదేశ ప్రజల స్థితిగతులను గూర్చియు ఈ క్రొత్త పన్నులు విధించుటను గూర్చియు అనుభవజ్ఞులగు జిల్లాకలెక్టరుల యభిప్రాయములను గూడ సేకరించి పైకి పంపిరి. వీరందరును ట్రెవిలియన్‌గారి అభిప్రాయములతో నేకీభవించిరి. అయినను కేంద్ర ప్రభుత్వమువారు తమ పట్టు విడువలేదు. ట్రెవిలియన్‌గారు వ్రాసిన మినిట్సు ప్రకటింపగా ప్రజలీ యన్యాయమును గూర్చి అసమ్మతి సభలుచేసి ఆందోళన చేసిరి. దీనికంతకును ట్రెవిలియనుగారే కారకులని కేంద్ర ప్రభుత్వమువారి ఫిర్యాదుపైన సీమ ప్రభుత్వమువారు ట్రెవిలియన్‌గారిని పనివదిలి వెనుకకు రమ్మనిరి. ఈ వ్యవహార సందర్భములను గూర్చి ట్రెవిలియన్‌గారొక స్టేటుమెంటును జారీచేయగా దానితో వారి మినిట్సు చేర్చబడి 1861లో లాంగ్మెన్సుగ్రీను అండ్ కంపెనీవారు దీనిని ప్రకటించిరి. పైన వ్రాసిన వాక్యములా పుస్తకములోనివే (Statement of Sir Charles Trevelyan on the circumstances connected with his recall from the Government of Madras. Longmans Green &Co., 1860). ఈ సర్ చార్లెస్ ట్రెవిలియనుగారిని తరువాత

కేంద్ర ప్రభుత్వ సభ్యునిగా నియమించగా ప్రజలెంతో సంతోషించి గొప్ప సభలు చేసి ఆయనకు స్వాగతమిచ్చి వారియెడల తమకుగల భక్తి విశ్వాసములను వెల్లడించిరి.

ఆంగ్లేయ కుంపినీ పరిపాలనమున భారతదేశ ప్రజలు తమకుగల బాధలను మాన్పుకొనుటకు చేసిన సాత్త్విక నిరోధములలో కుంపినీవారు వివిధ ప్రాంతములందు వివిధ కాలములలో ఇండ్ల పన్ను విధించినప్పుడు ప్రజలు చేసిన సత్యాగ్రహముల చరిత్ర చాలా చిత్రమైనది.

ఇండ్ల పన్నుపై సత్యాగ్రహము

మునిసిపాలిటీలలోనున్న ఇండ్లపైన పన్నులు చెల్లించుటకు మనమిప్పుడలవాటుపడియున్నాము. కాని, కొత్తగా కుంపినీవారీ పన్ను విధించినప్పుడు ఇది మన పూర్వులకు విపరీతముగను, అన్యాయముగను కనపడినది. ఎక్కడనైనను భూములపైన పన్ను వేయుట కలదు. ఎగుమతి దిగుమతి సరకుల పైన పన్ను వేయుట కలదు. కాని మా సొమ్ముతో మా స్థలములలో మేము గట్టుకొన్న ఇండ్లపైన పన్నులు వేయుట అక్రమమని మన పూర్వులు వాదించిరి. ఇక మా పిల్లలపైనగూడా పన్ను విధింపబడును కాబోలుననిరి. ఇండ్లపైన కుంపినీవారు విధించు పన్నులిచ్చుటకు నిరాకరించి, సమ్మెలుకట్టి, ధరణా గూర్చుని సాత్త్విక నిరోధము చేయసాగిరి.

చెన్నపట్టణమున ఆంగ్లేయ కుంపిణీవారి వర్తక స్థానముచుట్టును పెరిగిన నల్లవారిబస్తీలో ఇండ్లపన్ను వేయు ప్రయత్నము జరిగెను. ఈ బస్తీ రక్షణకొరకు చుట్టును ఆవరణగోడ ఫిరంగిదిమ్మలు కట్టవలసియుండెను. అందుకొరకు గావలసిన ఖర్చుక్రిందను నగర సంరక్షణ కొరకు గావలసిన సైన్యము ఖర్చుల క్రిందను కుంపిణీవారు ప్రజలవలన కొంత సొమ్ము వసూలు చేయదలచిరి. అందుకొరకు స్ట్రెయిన్ షాంమాస్టరు అనునతడు మద్రాసులో అధ్యక్షుడుగా నుండగా 1678లో ఇండ్లపన్ను విధింప దలచిరిగాని, ప్రజలలో పలుకుబడిగల వర్తకులు ఆందోళనచేయగా నాప్రయత్నము మానుకొనిరి.

మద్రాసులో

గిఫర్డు మద్రాసులో అధ్యక్షుడుగా నుండగా 1682లో మఖల ఇండ్ల పన్ను విధించుటకు ప్రయత్నించెను. ఈ నగర బందోబస్తు ఖర్చుల క్రింద సాలుకు 500 వరహాలిచ్చెదమని చెన్న పట్టణములో కాపురమున్న వివిధకులములవారి కులపెద్దలు వాగ్దానము చేసియుండిరి. ఆ సొమ్మునిప్పుడు కుంపిణీవారు నిర్బంధముగ వసూలుచేయ నిశ్చయించుటయే కాకుండా, చెన్నపట్టణ కాపురస్థుల నందరినిగూడ ఇంకను గొంత సొమ్ము నివ్వమని కోరిరి. ఇది వసూలు చేయుటకు ఇంటి పరిమాణములను బట్టి చిన్న పెద్ద ఇండ్ల పైన 3 మొదలు 9 ఫణముల వరకు ఇండ్లపన్ను విధించుటకు నిశ్చయించిరి. అంతట చెన్నపట్టణ కాపురస్థులందరును సమ్మెకట్టి అంగళ్ళు తెరవకుండా ఆటంకపరచి పట్టణములోనికి ధాన్యము కూడ రాకుండా నిరోధింపసాగిరి. ఈ కల్లోలము నణచుటకును పట్టణపు దర్వాజాలను కాపలా కాయుటకును కుంపిణీవారు సైనికులను బయటకుదీసికొని రావలసివచ్చెను. వివిధ కులపెద్దలను కుంపిణీ ప్రభుత్వమువారు నయముననను భయముననను లొంగదీయదలచిరి. పన్నులియనిచో వారియిండ్లను నాశనము చేసెదమనియు, అంగళ్ళను వశపరచుకొనెదమనియు, ఒక్కొక్కరిపైన పదివరహాలు జుల్మానా విధించెదమనియు కుంపిణీవారు బెదిరించిరి. తమ ప్రవర్తనకు కులపెద్దలు క్షమాపణ కోరిరిగాని, పన్ను మాత్రము రద్దుచేయమని గట్టిగా పట్టుపట్టిరి. ఇట్లు కొన్నాళ్ళు గడచెను. తరువాత 1686లో ఇందుక్రింద కొంత రివిన్యూనైనను వసూలుపరచి తీరవలెనని కుంపిణీ వ్యవహారములకు సర్వాధికారి అయిన సర్ జాన్ చైల్డుగారు నిశ్చయించెను. తరువాత ఇండ్లపైన పన్ను స్థిరముగా విధింపబడినను అప్పటికి మాత్రము ప్రజల పంతము నెగ్గెను.

కాశీలో

1813లో నిట్లే కాశీనగరమున ఇండ్లపన్నులు విధింపబడగా వేలకొలది గృహస్థులు భోజనములు మాని గంగానదీతీరమునకు బోయి అక్కడ ఘట్టములలో ధరణా కూర్చొని, ప్రాయోపవేశము చేయదలచిరి. ముఖ్యులగు బాహ్మణులు ఈ ఇండ్లపన్ను అక్రమమని తెలుపుచూ, తాము దీనినిగూర్చి చేయదలచిన చర్యను వివరించుచు దేశముపై నభిమానముకలవారందరును తమతో నేకీభవించవలసినదనియు, ఆ కాగితము చూచినవారింకొకరి కందచేయవలసినదనియు, అందుకు

విరుద్ధముగా ప్రవర్తించినవారికి తగులు శాపముల నుదాహరించుచు కరపత్రములు వ్రాసి కాశిలోను పరిసర గ్రామములలోనుగూడ పంచిపెట్టిరి. కుంపిణీ ప్రభుత్వమువారీయుద్యమ స్వరూపమును దెలిసికొనులోపలనే మూడులక్షలమంది ప్రజలు తమ యిండ్లను వదిలిపెట్టి, అంగళ్ళను మూసివేసి, భూములను పాడుపెట్టి, యిండ్లలో దీపారాధనలుమాని, చాలమంది భోజనములుకూడ చేయక చేతులు కట్టుకొని దుఃఖసూచకముగా తలలు వంచుకొని కాశిపట్టణము చుట్టునున్న విశాల మైదానములలో ధరణాగా గూర్చుండిరి.

అపజయము

కంపెనీ ప్రభుత్వమువారి స్థానికోద్యోగులకేమి చేయుటకును తోచలేదు. ఈ మూర్ఖులలో కొందరు చనిపోవుదురేమో యనుభయము కూడ కలిగెను. వ్యవసాయ తరుణమున పనులాగినందున క్షామముకూడ సంభవించు ననుభయము కలిగినది. రాకపోకలు, రవాణాలు నిలిచిపోయినందున, కుంపిణీవారి ఆదాయముగూడ తగ్గునని తోచినది. ఈ విచిత్ర ప్రదర్శనముకన్న దీనివలన కలిగిన కలవరమును విషాదమును ప్రజలలోనింకను తీవ్రమైన ఆశాంతిని కలిగించునని తోచినది. అయినను ప్రజల కోర్కెను మన్నించి లొంగినచో ప్రభుత్వ గౌరవమునకు భంగము కలుగునని వారు పన్నును రద్దుచేయుట కంగీకరించలేదు. స్థానికోద్యోగులు తొందరపడక అనవసరమగు చర్యలు దీసికొనక చాల అప్రమత్తతతోను శాంతములోను మెలగిరి. ఈ సమావేశమును బలవంతముగా చెదరగొట్టినచో ప్రజలయందు విషాదభావము వర్ధిల్లియుండెడిదే! అట్లు చేసినచో తమ కార్యసాఫల్యమగునని బ్రాహ్మణులాశించియుండిరి గాని, ప్రభుత్వోద్యోగులట్లు చేయక ఈ కుట్రదారుల నాయకులతో మెల్లగా బుజ్జగించి మాటలాడుచు ఇటువంటి సందర్భములలో ప్రభుత్వము లొంగుట అసంభవమనియు, వృథాగా ధరణా గూర్చుని ప్రాయోపవేశము చేసినందువల్ల తమకు కష్టము కలుగుటతప్ప వేరు ప్రయోజనముండదనియు నచ్చచెప్పిరి. ఈ నేటివుల చర్యలను తాము గమనించినట్లుగాని వీరేమైన అక్రమములకు దిగుదురేమోయని తామనుకొనినట్లుగాని పైకి కనబరుపకుండగనే ప్రభుత్వమువారు ఘాజీపూరులనుండి ఐరోపా సైనిక దళములను తెచ్చి సిద్ధముగానుంచుకొనిరి. ఎట్టకేలకు ప్రజా సమూహము ఆకటికి మాడసాగెను.

ఇంతలో ఉరుములు మెరుములతో వచ్చిన వర్షము వీరిని తడిపి బాధపెట్టెను. అంతట తమ విధానమునందు కొంత మార్పుచేయుట అవసరమని సాత్విక నిరోధము చేయువారిలో కొందరు పలుకసాగిరి. గవర్నరు జనరలు దగ్గరకు పదివేలమంది ప్రజల రాయబారమొకటి స్వయముగ పోవుట యుక్తమనిరి. ఇది బాగున్నదని చాలమంది పలికిరి. అయితే ప్రయాణములో వీరి నందరిని భరించుటెట్లను సమస్య వచ్చెను. అంతటనొక బ్రాహ్మణ ముఖ్యుడు ఇంటికింతయని మన ఇండ్లపైననే పన్ను వేసికొని భరింతమనెను. మన యిండ్లపైననే పన్ను వేసికొనుటకొప్పుకొన్నచో ప్రభుత్వమువారితో తగవుపెట్టుకొనుటకూడ ఎందుకు? ఈ బాధలుపడుట ఎందులకు? అను విషాద భావము ప్రజాసంఘము నందు చీలిక గలిగించెను. అంతట నీ సాకుతో కొంతమంది లేచిపోయిరి. కొంతమందిమాత్రము ఎవరిఖర్చులు వారు భరించి గవర్నరు జనరలు దగ్గరకు పోవుదమనిరి. ఇట్లు ప్రజలలో అభిప్రాయభేదబీజములు నాటబడి వర్ధిల్లెను. మూడు దినముల తరువాత నీ విషయమై జరిగిన సమావేశమునకు చాలమంది రాలేదు. అయినను తమకు దొరికిన సంబారములను సేకరించికొని 10 వేలమంది మొదలు 20 వేలమందివరకూ సమావేశమై తమ ప్రస్థానమునకు బయలుదేరిరి. దీనికిగూడ మేజస్ట్రేటులు ఆటంకపరుపక దూరదృష్టితోనూరకొనిరి. త్వరలోనే వీరి తినుబండారములు హరించిపోవుననియు ప్రయాణము దుర్ఘటమగుననియు గ్రహించి, గుఱ్ఱపు రౌతులదళములతో వీరిని కనిపెట్టి యుండిరి. ఆకలి వీరిని బాధించునని కొండలు అడవులుగలదారి ఈ జన బాహుళ్యమునకు ఇబ్బందిని కలిగించునని వారెరుగుదురు. అట్లే జరిగినది. కొద్దిరోజులలోనే ఈ జనులలో చాలమంది ప్రయాణము మానివేసి, వెనుకకు మరలిరి. ఇట్లే విషయమున కుంపిణీ ప్రభుత్వము జయమును గాంచెనుగాని, ప్రజల కిష్టములేని యిండ్లపన్ను బలవంతముగా వసూలుపరచుటవలన చాల నష్టములు కష్టములు కలుగునని గవర్నరుజనరలు ప్రభుత్వమువారు గ్రహించి, దీనిని చల్లగా రద్దుచేసిరి. ఈ ప్రజల యుద్యమమును కఠినముగా అణచుటకు ప్రయత్నించి యుండినగాని జాగ్రత్తగను ఒడుపుగను ప్రభుత్వోద్యోగులు ప్రవర్తించి యుండనిచోగాని ఇది భయంకర రూపము దాల్చి భారతదేశమందంతటను నంటుకొనియుండెడిది. ఈ చరిత్ర బిషప్ హెబరుగారు రచియించిన జర్నలులో మొదటి సంపుటమున 432 మొదలు 486 పేజీలలో వర్ణింపబడియున్నది.

విల్సన్‌గారు రచియించిన హిందూ దేశ చరిత్ర 1వ సంపుటము 436-469 పుటలలో గూడ ఈ చరిత్ర వర్ణింపబడినది.

ఇట్లే బేరిల్లీ పట్టణమున 1815 సంవత్సరమున ఇండ్లపన్ను విధించుటకు కుంపిణీవారు ప్రయత్నించగా ప్రజలు సాత్విక నిరోధము చేసిరి. ఈ చరిత్ర విల్సన్‌గారి హిందూదేశ చరిత్రలో 8వ సంపుటమున 120-128 పుటలలో వర్ణింపబడినది.

కొన్నేండ్ల క్రిందట దక్షిణ కన్నడ జిల్లాలో ప్రజలకిష్టములేని పన్నొకటి విధింపబడినట్లునూ అంతట ప్రజలు సాత్విక నిరోధము చేసినట్లును ఆ జిల్లాలో కలెక్టరు పనిచేసిన ఆర్థర్ హోల్ అను నధికారి మద్రాసు గవర్నరగు సర్ ఛార్లెస్ ట్రివిలియన్‌గారికి 1859లో నివేదించియున్నాడు. ఇట్లు గాంధి మహాత్ముడు స్వరాజ్యోద్యమమున నేడు ప్రయోగించుచున్న సాత్విక నిరోధ విధానము భారతదేశమున అనాది సిద్ధమైనది. ఈ సంగతిని మహాత్ముడిదివరకనేక పర్యాయములు వ్రాసి యున్నాడు.

(సమాప్తం)